# అశోకచక్రవర్తిధర్మశాసనములు.

(ప్రాకృతమూలము, సంస్కృతాంధ్రపరివర్తనములు.)

"నాస్తి హికర్మాంతరం సర్వలోకహితాత్."

"యత్తు ఇదం అత్మనా పరిత్యపగమనం తి స్మే ముఖ్యామతకు"

అనువాదకుఁడు

చిలుకూరి నారాయణరావు ఎమ్. ఏ. ఎల్. టి.



చారిత్రికోపోద్ఘాతము.

దేశభట్ల లక్ష్మీనరసింహము ఎమ్. ఏ. ఎల్. టి.

ప్రకాశకులు.

ప్రపంచమతగ్రంథమాలాకార్యస్థానము

దానవాయిగుంట, రాజమహేంద్రవరము.

రాజమహేంద్రవరము.

 1928 [వెల రు 2—0—0లు

# అంకితము

ఓమ్

నమోం భగవతేం వాసుదేవాయ

శ్రీ

ధర్మైకనిరతులును

ధర్మప్రతిష్ఠాపనమందు బద్ధకంకణులును

ధర్మనిర్వహణకార్యదీక్షాపరతంత్రులును

వాసిష్ఠ, మైత్రావరుణ, కౌండిన్యత్ర్యార్షేయప్రవరాన్విత

శ్రీకౌండిన్యసగోత్రోద్భవులును

ఈఅర్పణపత్రిక : రెండవప్రక్క పయిఁగలరిజిష్టర్డు చారిత్రకపత్రములు దాఖలా

"ఆంధ్రనియోగులును, కృష్ణయజుర్వేదాంతర్గత ఆపస్తంబసూత్రము వారును,

ప్రస్థానత్రయములోని శ్రీమద్భగవద్గీతా - ఉపనిషత్,

అను

కర్మయోగశాస్త్రాధ్యాయులును,

అద్వైతమతస్థులును,

స్వవిద్యాభిమానము, స్వమతాభిమానము, స్వదేశాభిమానము, స్వరాజ్యాభిమానముఁ గలవారలును,

కృష్ణామండలస్థ వీరవల్లి మొఖాసాగ్రామమునకు సమీపమునందున్న వుయ్యూరుగ్రామవాస్తవ్యులును, కీర్తినారాయణులును, విజ్ఞానచంద్రులును"

నగు

శ్రీ శ్రీ శ్రీ

కౌండిన్యగోత్ర ఆదిరాజు శ్రీరాములుపంతులుగారు,

ఆఫ్ వీరవల్లివంతు అను వారికి

సాష్టాంగదండప్రణామము లాచరించి

సంస్కృతాంధ్రానువాదములతోఁగూడిన

"అశోకచక్రవర్తి ధర్మశాసనములు" అని

ఈగ్రంథమును

భక్తిగౌరవపురస్సరముగా

నంకితము చేయుచున్నాఁడను.

చిలుకూరి నారాయణరావు ఎం. ఏ. యల్. టి.

ఆంధ్రదేశీయేతిహాససంశోధకమండలి - ప్రధమాధ్యక్షులు.

మొఖాసాదార్ గా రైన

బ్రిహ్మశ్రీ॥ మ॥ రా॥ రా॥ శ్రీయుక్తులగు కౌండిన్యగోత్రి ఆదిరాజు శ్రీరాములు పంతులుగారు వ్రాయించియిచ్చినట్టియు, వ్రాయించుకొన్నట్టియు, కృష్ణాజిల్లా గన్నవరముతాలూకా వుయ్యూరు సబ్ రిజిస్ట్రారు జ్యూరిస్‌డిక్షనులోఁ జేరిన వీరవల్లిమొఖాసాగ్రామము దరివుయ్యూరు గ్రామసబ్రిజిష్ట్రారాఫీసులో రిజస్టరీ చేయఁబడినట్టియు చారిత్రికపత్రములవైనము;—

మహారాజశ్రీ The Secretary of State for India in Council acting by the Postmaster General of Madras అను వారిపేర వ్రాయఁబడినట్టియు 1 పుస్తకం 120 వాల్యూమ్ 478-481 పుటలలో నెం. $\frac{2951}{1919}$ రు గా రిజష్టరు కాఁబడినట్టియు, Indenture పత్రము.

2\. 1 పుస్తకం 138 వాల్యూం 401 to 500 పుటలలోను 206 వాల్యూం 1 to 18 పుటలలోను 1924 సం॥ రపు నె 1304 రు రిజష్టరుచేయఁబడిన చరిత్రాత్మకవారపత్రము. నోటు;— ఈపత్రము వ్రాయించుకొన్నవారు శ్రీకురానుషరీఫ్ గ్రంథావలంబకులు.

3\. 4 పుస్తకం 2 వాల్యూం 491 to 500 పుటలలోను, 5 వాల్యూం 77 to 82 పుటలలోను 1925, సం॥ రపు 10 నెంబరుగా రిజస్టరుచేయఁబడిన శ్రీధర్మవిద్యోపన్యాససహిత వైతరణీగోదాన ధర్మశాసనము.

4\. మహారాజశ్రీ The Secretary of State for India in Council acting by the Superintendent of Post offices, Guntur Division అనువారిపేర వ్రాయఁబడినట్టియు 1 పుస్తకం 223 వాల్యూం 273 To 278 పుటలలో 1926 సం॥ రపు

1878 నెంబరుగా రిజిస్ట్రీచేయఁబడిన చరిత్రాత్మక Indenture పత్రిము.

5. 1 పుస్తకం 206 వాల్యూం 191 - 200 పుటలలో 1927 సం॥ రపు 225 నెంబరుగా రిజిస్టరుచేయఁబడిన చరిత్రాత్మకక్రయకంట్రాక్టు పత్రము.

6. 1 పుస్తకం 206 వాల్యూం 245 — 257 పుటలలో 1927 సం॥ రపు 2129 నెంబరుగా రిజిస్టరుచేయఁబడిన చరిత్రాత్మకవారపత్రిము.

# విషయసూచిక

# ఉపోద్ఘాతము

---

ప్రపంచచరిత్రమునం దెన్నియోరాజ్యములు పొడచూపినవి, ఎన్నియోయంతరించినవి. తృష్ణాబద్ధులై ఎందరోరాజులు ప్రజలనుపీడించిరి, ప్రజలచేచంపఁబడిరి. పరదేశములపైదాడులువెడలి, యుద్ధభూములం దెందరోరాజులుహతులైరి. లేదా, విజయముఁబొంది కొంతకాలమాపరరాజ్యముల ననుభవించిరి. కాని, ఈవిజయమంతయు రక్తమయమై, దుఃఖాకరమై, క్షణభంగురమై యుండెను. మహోన్నతదశలననుభవించిన మహారాజ్యములన్నియు నేఁడు భూమిలోనెచ్చటనో యూరునుపేరునులేక యడఁగియున్నవి. కొన్ని నామమాత్రావశిష్టములయినవి. ఇట్టివిజయములును, ఇట్టిరాజ్యములును నెందుకును పనికిరాకపోయినవని ప్రపంచచరిత్రము సాక్ష్యమిచ్చుచున్నది.

కాని, ఇట్టివిజయముకంటె మేలైనదియు, శాశ్వతమైనదియు నగు విజయముగలదని తెలుపుటకు అనేకచక్రవర్తులు పాటుపడియున్నారు. ధర్మవిజయమే నిజమయినవిజయమనినమ్మి, తమకుసత్యమనితోఁచినధర్మమును లోకమునందువ్యాపింపఁజేసి ప్రజలఇహపరసౌఖ్యములకు తోడుపడిన మహాచక్రవర్తు లందందుగలరు. ఇట్టివారు హిందూదేశమునందేకాక పరదేశములందును నుండిరి. కానిస్టంటైనుచక్రవర్తి, మార్కసుఅరిలియసు, ఆల్ఫ్రెడు, ఛార్లమేను, మొదటిఒమారుఖలీఫు, అక్బరు మొదలగుచక్రవర్తులుకొందరు ధర్మస్థాపనముకొరకును, ధర్మప్రచారముకొరకును, ప్రయత్నములుచేసినట్లు మనకు చరిత్రములవలన తెలియుచున్నది. కాని, ధర్మవిషయమున భారతవర్షమునందు రాజులుగాని, ప్రజలుగాని శ్రద్ధతీసికొనినటు ఇతరదేశములందు కానరాదు. భారత

దేశ మనాదినుండియు ధర్మకల్పద్రుమమున కాలవాలమైయుండి యామహావృక్షము సర్వదిగంతములందును దానిశాఖలను పర్వఁజేసి దానినీడలయందు సర్వభూతసంతానమును సుఖించునట్లు చేసియున్నది. మోక్షోపాయములనుగూర్చినజిజ్ఞాస భారతదేశమునందువలె మరియెచ్చటను జరిగియుండలేదు. శిబి, దధీచి మొదలగువారుచేసిన యాత్మత్యాగము నిరుపమానమైయున్నది హరిశ్చంద్రుఁడు సత్యపరిపాలనముకై పడినకష్టములు సుప్రసిద్ధములైయున్నవి. పితృవాక్యపరిపాలనమునకై శ్రీరాముఁడుఅనుభవించినకష్టములు ఆదర్శప్రాయములై యున్నవి. ఇట్లెందరో పురాణప్రసిద్ధులైన మహారాజులు ధర్మస్థాపనవిషయమున బద్ధకంకణులై పనిచేసియుండిరి. కేవలచారిత్రికయుగమునందును ఎందరోచక్రవర్తులు ధర్మదృష్టితో పరిపాలనమునుసాగించి, ప్రజలఇహపరసౌఖ్యములకు తోడుపడియుండిరి.

హిందూదేశధర్మచరిత్రమందు గౌతమబుద్ధశాక్యమునియవతారము క్రొత్తయుగమును స్థాపించుచున్నది. అతనికిపూర్వము ప్రచారలోనుండిన వైదికమతము తొల్లింటియుచ్చదశనువీడి, ధర్మవిషయమున విపరీతాభిప్రాయములతో నొప్పియుండి, యజ్ఞములకును, పశుహింసకును, నెక్కువప్రాధాన్యము నొసంగియుండెను. జనులయందు దుఃఖమంతరించుటకుగాని, సౌఖ్యమభివృద్ధినొందుటకుగాని యప్పటివైదికధర్మము ఇసుమంతయుతోడ్పడఁజాలకయుండెను. శాక్యగౌతమునికి జనులయవస్థ దుర్భరముగానుండెను. అందుచేత నాతఁడు రాజ్యభోగములను విసర్జించి మోక్షోపాయమునుకనుగొన నరణ్యములకేఁగెను. అచ్చటనున్న తపస్వులనాశ్రయించెను. కాని, వారియుపదేశములించుకంతయు నాతనికి చిత్తశాంతినిగలిగింపవయ్యెను. ఒకనాఁడాతఁడు కఠినోపవాసము చేసి, మూర్ఛనొందెను

అతఁడు కఠినతపస్సుచేత మిక్కిలి యుత్కృశించి శల్యగతప్రాణుఁడై యుండి, ఒకరావిచెట్టుక్రిందకూర్చుండి యాదినమంతయు ధ్యానములో మునిఁగియుండెను. అప్పుడాతని కొక్కసారిగా జ్ఞానోదయమయ్యెను. ఆతఁడు తానులోకమునందువ్యాపింపఁజేయవలసిన ధర్మమునుగూర్చి నిశ్చయించుకొనెను.

## బౌద్ధధర్మము

జగత్తు సత్యమా యసత్యమా యనువిషయమునుగూర్చి బుద్ధుఁడు నిర్ణయింపలేదు. అట్టివిచారము వ్యర్థమైనదని యాతనియభిప్రాయము. జడజగత్తును, చేతనాజగత్తును నున్నవనుట నిర్వివాదాంశము, ఇట్టిజగత్తు కార్యకారణరూపమును దాల్చి పరిణామమునుబొందుచున్నది. మనుష్యులేకాక దేవతలుఁగూడ తమతమకర్మానుసారముగ పుట్టుచుఁ గిట్టుచునుందురు. భూమి, స్వర్గములు, నరకములు, అన్నియు సృష్టిలయములకు లోనగుచునేయున్నవి. చక్రనేమిభ్రమణన్యాయమున నివి యన్నియుఁ బ్రవర్తించుచునేయున్నవి. మనుష్యుఁడు తానొకప్రత్యేక వ్యక్తినని యీయజ్ఞానమువలన తలంచుచుండును. ఆయజ్ఞానమువలననే తృష్ణకులోనై క్రొత్తకోరికలనుకోరుచు, అవిసిద్ధించువరకును నసౌఖ్యపరుఁడై యుండును. కోరికలు దుష్టములైనవైనను, మంచివైనను దుఃఖమునకు మూలములగుచుండును. అష్టసంపదలనుగలిగియుండినయెడల ఈతృష్ణను జయింపవచ్చును.

మనుష్యుని అయిదుస్కంధములుగల యొకమహావృక్షముతో పోల్పవచ్చును. అందు మొదటిస్కంధము రూపాత్మకమయియున్నది. పృథివ్యప్తేజోవాయువులు, చక్షు, శ్రోత్ర, ఘ్రాణ, రసనా శరీరములు, రూప, ధ్వని గంధ, రసములు, పుం స్త్రీ భేదములు, అన్నవీర్యాకా

శములు, సంజ్ఞా వాక్కులు, పదార్థములు పొందు నేడువిధములగు నవ స్థలు—ఈ యిరువదియేకురూపములును ప్రథమస్కంధాంతర్గతములై యున్నవి. రెండవస్కంధము వేదనారూపమై యున్నది. ఇది సుఖము దుఃఖము, సమసుఖదుఃఖము అని మూఁడువిధములుగా నున్నది. మూఁడో స్కంధము సంజ్ఞారూపమునయున్నది. నాలుగవస్కంధము సంస్కారరూపమునయున్నది. ఈసంస్కారము దైహికము, వాచసికము, మానసికము, అని మూఁడువిధములుగా నుండును. స్పర్శము, వేదన, సంజ్ఞ, చేతన, మనసికారము, సతి, జీవితేంద్రియము, ఏకాగ్రత, వితర్కము, విచారము, వీర్యము, అధిమోక్షము, ప్రీతి, ఛందము, మధ్యస్థత, ఆలస్యము, మిథ్య, మోహము, ప్రజ్ఞ, లోభము, అలోభము, అవతాపము, అనుతాపము, హ్రీ, అహ్రీ, దోషము, అదోషము, విచికిత్స, శ్రద్ధ, దృష్టి, ప్రసాదము, లఘుత, మృదుత, కర్మజ్ఞత, ప్రాజ్ఞత, ఉద్యుక్తత, శర్మము, కరుణ, మోదము, ఇచ్ఛ, మాత్సర్యము, కుత్సితము, ఔద్ధత్యము, మానము,—అని చేతసికసంస్కారము లేఁబదిరెండుగ నున్నవి. విజ్ఞానమనునది యైదవస్కంధము. ఇది పాపపుణ్యానుసారముగ ఎనుబదితొమ్మిదివిధములుగనున్నది.

ఈస్కంధములెవ్వియు నిత్యములైనవి కావు. వీనిలో నెద్దియు నాత్మ కానేరదు. నేనున్నాను, నేనుండఁగలను, నేనుండను, నాకుగుణములులేవు—ఇట్టిమాటలన్నియు నజ్ఞానమువలనఁ గలుగుచున్నవి. ఇట్టి యజ్ఞానమునకే సత్కాయదృష్టి యనియు, ఆత్మవాదమనియు, పేళ్ళు. బౌద్ధమతమునం దాత్మయనునది అంగీకరింపఁబడలేదు

కాని, పునర్జన్మమమును బౌద్ధమతమునం దొప్పుకొనకతీరినది కాదు. దానినొప్పుకొననియెడల ఈజన్మమున జనులనుభవించు సుఖదుఃఖములకు తగినకారణము కానరాదు. పూర్వజన్మసుకృతదుష్కృత

ప్రకారము జనులీజన్మమందు సుఖదుఃఖముల ననుభవించుచుందురు. ఈపునర్జన్మ మెత్తుటకు "తృష్ణ" లేక "ఉపాదాన" మనునది కారణము. ఇంద్రియార్థసంయోగమువలన వేదనకలుగును. వేదనవలన తృష్ణకలుగును. తృష్ణవలన ఉపాదానముకలుగును. ఇందువలన పూర్వదేహమునందలి పంచస్కంధములును విడిపోయినను, క్రొత్తవి మరియైదు స్కంధములుకూడి క్రొత్తజీవుఁ డుత్పన్నుఁడగును. పూర్వజన్మనముపార్జితమగు కర్మమునశింపక సాగుచునే యుండును. అది ప్రత్యేకజీవులనేకాంటియుండక, సంఘమంతటిమీఁదను తనప్రభావమును చూపుచుండును. కావున, ప్రతిజీవియును తానాచరించుకర్మములవలన సంఘమునకు బాధ్యుఁడై యుండును. అందుచేతనే ప్రత్యేకజీవులు తమసౌఖ్యముకొరకుమాత్రము పాటుపడకూడదు. స్వసౌఖ్యేచ్ఛ యజ్ఞానమువలన కలుగుచున్నది. అజ్ఞానము పాపమునకుమూలము. పాపము దుఃఖమునకుమూలము. ఎన్ని జన్మములెత్తినను అజ్ఞానమును, అశాశ్వతత్వమును తప్పవు. శాశ్వతము యినది ఎద్దియులేదు. బ్రహ్మాండమంతయు నశింపవలసినదే. మనము చూచుచున్న సర్వమును నశ్వరమగుచున్నది, మనోవాక్కాయకర్మముల ఫలితముమాత్రము మిగులుచున్నది. కావున జనులు పరిశుద్ధులును, దయాపరులును, అనలసులునై యుండవలెను. జాగ్రత్తపడి, అజ్ఞానమును పాఁద్రోలి, సంసారార్ణవమున నల్లకల్లోలముగఁ దేలియాడుచుండు ఇచ్ఛాతరంగములదారిని విడిచి, ధర్మపథమున ననుసరించి, శాశ్వతానందమునకును, శాశ్వతశాంతికిని, జ్ఞానమునకును నిదానమగు నిర్వాణమును బొందవలయును.

## ధర్మపథము

దుఃఖము, దానికికారణము, దానినణఁగద్రొక్కుట, దానిని నశింపఁజేయుటకుమార్గము అనువానినిదెలుపు నాలుగుగొప్పసత్య

ములను గౌతమబుద్ధుఁడు నిర్వచించెను. జన్మము, పంచస్కంధములు, క్షయము, రోగము, మృత్యువు, ప్రత్యేకత్వబుద్ధి, ఇవియన్నియు దుఃఖాత్మకములైనవి. వేదనవలనగలిగి, కామమోహములకు కారణములై, సుఖదుఃఖములనుకలిగించు తృష్ణయే దుఃఖమునకుకారణము. తృష్ణనడుగంటఁజేసి కామమునుజంపినయెడల దుఃఖములు తామరాకుమీఁది నీటిబొట్లవలె దుళ్ళిపోవును. ఈతృష్ణనుజయించుటకు ధర్మపథావలంబనమే ముఖ్యసాధనము. ఈధర్మపథము ఎనిమిదిభాగములుగానున్నది. సరియైనయభిప్రాయములు (సమ్యగ్దృష్టి). సరియైనయాశయములు(సమ్యక్సంకల్పము), సరియైనమాటలు (సమ్యగ్వాక్కు), సరియైనసడవడి(సమ్యక్కర్మ), సరియైనజీవితము(సమ్యగ్జీవనము) సరియైనఉత్సాహము(సమ్యగ్వ్యాయామము),సరియైనమనస్సు(సమ్యక్స్మృతి), సరియైనధ్యానము (సమ్యక్సమాధి) అనునవియే ఈభాగములు. ఈధర్మపథమునందు నాలుగు మజిలీలున్నవి. సత్పురుషులతో సహవాసము, ధర్మశ్రవణము, సరియైనమననము, పుణ్యకార్యాచరణము, అనునవి మొదటిమజిలీ. దీనినిచేరువాఁడు మోహమునువీడి, బుద్ధునియందును, ఆతఁడుబోధించినధర్మములందును సంశయములనువదలి యజ్ఞయాగాదులయందు నమ్మకమునువిడిచిపెట్టును. రెండవమజిలీనిచేరినవాఁడుకామము, ద్వేషము, మోహము అనువానిని పరిత్యజించి, ఈలోకములో మరియొక్కజన్మముమాత్రమెత్తును. మూఁడవమజిలీచేరినవాఁడు రాగద్వేషములను సంపూర్ణముగవిడిచిపెట్టి, ఎట్టికోరికలును లేక, తనహృదయమునందు ఇతరులయెడల నెట్టిద్వేషమును కలిగియుండక, ఈలోకమునకు తిరిగిరాకుండును. నాల్గవమజిలీ అర్హతులగువారుచేరునది. అర్హతులగువారు రూపరాగమునుగాని, అరూపరాగమునుగాని, కలిగియుండరు. వారికి మానము, ఔద్ధత్యము, అవిద్య అనునవి ఉండవు.

ఈరీతిగా సమస్తదోషములనుండియు విడిపడియున్నవాఁడు ఇహ

లోకవస్తువులఁగూర్చి యెంతగానాలోచింపఁడు. దుష్టములైనకోరికలు పెల్లగింపఁబడియుండుటచే, అతనిమనస్స్వచ్ఛమును ఇతరులయెడల, దయాదాక్షిణ్యాదిసద్గుణములకు తావలమైయుండును.

ఇట్లు (1) సత్కాయదృష్టి (2) విచికిత్స (3) శీలవ్రతపరామర్శము (4) కామము (5) ప్రతిఘ (6) రూపరాగము (7) అరూపరాగము (8) మానము (9) ఔద్ధత్యము (10) అవిద్య అనునీదోషములనువిడిచిపెట్టుటకే ఈధర్మమార్గము విధింపఁబడియున్నది. దీనిలో మొదటి యైదుదోషపాశములనుండియు విముక్తుఁడయినవాఁడు అర్హతావస్థను బొంది తురీయమార్గమును అవలంబించును. తక్కినయైదుదోషపాశములను విడిచినవాఁడు అశోకుఁడై సమస్తమోహామునుండియు, సమస్త దుఃఖమునుండియు విముక్తుఁడై నిర్వాణమును బడయును.

బౌద్ధమతమునందలి ముఖ్యసిద్ధాంతమును పైని సంగ్రహముగా వివరించితిమి. అందుసత్ప్రవర్తనము చాలముఖ్యమయినట్లు తెలుపఁబడి యున్నది. మనుష్యునిధర్మాభివృద్ధికి నైతికజీవనము చాలప్రధానమయి యున్నది. నీతిప్రవర్తనమునుగూర్చి బుద్ధుఁడాయాతరగతులవారికి సంపూర్ణములగువిధులను ఏర్పరచియున్నాఁడు. తల్లిదండ్రులునుపుత్రులును, గురువులునుశిష్యులును, భార్యాభర్తలును, స్నేహితులునుపరిచితులును, ప్రభువులునుసేవకులును, గృహస్థులునుభిక్షువులును, పరస్పరము నెట్లు సంచరింపవలయునో బుద్ధుఁడు వివరముగఁదెలిపియున్నాఁడు. ఇదిగాక ఆయాసందర్భములందు ఎన్నియోసూక్తిముక్తాఫలము లాతనినోటినుండి వెలువడినవి. వానిలో కొన్ని ధర్మపథమనుగ్రంథమున చేర్పఁబడి యున్నవి. ఆసూక్తులలో కొన్నిటి నీక్రిందవ్రాయుచున్నాము.

“ఈలోకమునందెచ్చటను ద్వేషము ద్వేషమువలన నంతరింపదు. ద్వేషము ప్రేమమువలననే యంతరించును. ఇదియే దానిస్వభావము.

బాగుగానేయని ఇంటిలోనికి వర్షముకురియునట్లు, సుసమాహితముగానిమనస్సులోనికి కామముప్రవేశించును.

మోహావిష్టులై మూర్ఖులు దంభమునను సరింతురు. బుద్ధిమంతుఁడు శ్రద్ధను పరమధనముగా సంరక్షించుకొనును.

మనస్సునరికట్టుట కష్టము. అది పరుగెత్తుచుండును. తనయిష్టమువచ్చినచోటికి దాడువేయుచుండును. దానిని మచ్చికచేయుట మంచిది. అదియే యానందముకలుగఁజేయును.

పువ్వుయొక్క రంగునుగాని, సుగంధమునుగాని ఎట్టిఅపాయమునుకలుగనీయక, మధువునుగ్రోలి, తేనెటీగ ఎగిరిపోవునట్లు ప్రాజ్ఞుఁడు భూమిపైవసింపవలయును.

చిత్రవర్ణములుగలిగియు నిర్గంధమగుచక్కనిపూవువలె ఆచారహీనమయిన చక్కనిమాటలనాడుట నిరర్థకమయియుండును చక్కని వర్ణమును, మంచిసుగంధమునుగల కోమలపుష్పమువలె తాను పలుకువలుకులప్రకారము ఆచరించుట ఫలవంతమైయుండును.

యుద్ధమునందు లక్షలకొలఁదిజనులను జయింపవచ్చును. కాని, తన్నుతానుజయించుకొన్నవాఁడే వీరుఁడు

కోపమునుదయచేతలు, కీడునుమేలుచేతను, లోభినిదానముచేతను, అసత్యవంతుని సత్యముచేతను జయింపవలెను

సత్యమునువలుకవలెను, కోపమునకులోఁబడకూడదు. అడిగినవారికి తనకున్నకొంచెములోనుండియే ఈయవలెను. 'ఈమూడింటివలనను దేవతలనుసందర్శింపవచ్చును.

పుట్టుకవలనఛండాలుఁడుకానేరఁడు; పుట్టుకవలన బ్రాహ్మణుఁడును కానేరఁడు. తానుచేయుపనులవల్లనే ఛండాలుఁడగును. తానుచేయుపనులవలననే బ్రాహ్మణుఁడగును.

గౌతమబుద్ధుఁ డట్టిసిద్ధాంతములను, నీతులను దె ల్పుటయేకాక వాని నాచరణమునందు బెట్టుటకుతగిన యేర్పాటులనుగావించెను. తన ధర్మమును జనులయందు వ్యాపింపఁజేయుటకు నత్ప్రివర్తనముగల్గి యాధర్మమును నిస్సంశయముగా నవలంబించెడివారు కావలయునుగదా. వారు సంసారబంధములందు తగుల్కొనియున్నంతకాలమును ధర్మమునితరులకు బోధింప నవకాశములుకలుగవు. కావున నాధర్మప్రివర్తకులు సంసారమునువిడిచిపెట్టవలయును. నియతాహారులై యుండవలెను. జనులవాసగృహములకు దూరముగావసింపవలెను ఎందుకునుపనికిరాని గుడ్డలను ధరింపవలెను. కామవశులు కాకూడదు. దారిద్ర్యమును అంగీకరింపవలెను. వినయపరులై యుండవలెను. భిక్షాటనమువలన జీవనముగడుపవలెను. ధ్యానసమాధులనవలంబించి నిర్వాణముకొరకు పాటుపడవలెను.

ధర్మమునవలంబించి నిర్వాణమును బడయగోరువారెల్లరును ఒకచోఁజేరినచో ధర్మవ్యాపనముశీఘ్రముగజరుగుటకు వీలుండును. కావుననే గౌతమబుద్ధుఁడు భిక్షువులసంఘములుస్థాపించి, యవినిర్వర్తింపవలసినవిధుల నేర్పాటుచేసి, తానున్నంతకాలమును వానిని సరిగసాగించుటకు కట్టుదిట్టములుచేసెను. ఈసంఘమునందు ప్రవేశింపఁగోరువాఁడు తొలుతనందు ఉపాసకుఁడుగా ప్రివేశింపవలెను. ఉపాసకుఁడుకాఁగోరువానికి ఎనిమిదేండ్లవయస్సైనను ఉండవలెను. నియమితదినమున పదిమందికి తక్కువగాని భిక్షువులుండుసభయొకటి కూడును. దానికి పదియేండ్లు భిక్షువుగానుండినవాఁడు అధ్యక్షుఁడుగానుండును. ఈసభలో నాభిక్షువులు చాఁపలమీఁద రెండువరుసలుగా నొకరికొకరెదురుగఁ గూరుచుందురు. ఉపాసకుఁడు కాఁగోరువాఁడు సాధారణవస్త్రములుకట్టుకొని మూఁడుకాషాయవస్త్రములను చేతనుంచుకొనియుండఁగా నొకభిక్షువు ఆతనిని సభవారికిచూపును. ఉపాసకుఁడు అధ్యక్షునకునమస్కరించి,

"ఆర్యా, నన్ను కరుణింపుము. ఈకాషాయములను గ్రహించి నాదుఃఖముపోయి నిర్వాణముఅనుభవించుటకై నన్ను పాసకునిజేయుము" అని పలుకును. అంతట అధ్యక్షుఁడా కాషాయములను తీసికొని, ఆయుపాసకునకు కట్టిపెట్టును. అప్పుడాతఁడు అధ్యక్షునిమ్రోల మోకరిలఁబడి

బుద్ధుఁడేనాకు శరణము
ధర్మమేనాకు శరణము
సంఘమేనాకు శరణము

అని మూఁడుసార్లుఉచ్చరించును. పిమ్మట "నేనహింసావ్రతమును స్వీకరించుచున్నాను. నేనస్తేయవ్రతమును స్వీకరించుచున్నాను. నేను శౌచవ్రతమును స్వీకరించుచున్నాను. నేను సత్యవ్రతమును స్వీకరించుచున్నాను. పుణ్యమునకును అభివృద్ధికిని నాటంకముగలిగించు మద్యసేవనమును చేయనని వ్రతమునుస్వీకరించుచున్నాను. నేను నృత్యనాట్యాదివినోదములందు పాల్గొననని వ్రతమునుస్వీకరించుచున్నాను. గంధమాల్యాభరణసేవను అంగీకరింపనని వ్రతమును స్వీకరించుచున్నాను. సుఖశయ్యను వదలిపెట్టెదనని వ్రతమునుస్వీకరించుచున్నాను. బంగారమునుగాని వెండినిగాని పుచ్చుకొనననని వ్రతమునుస్వీకరించుచున్నాను" అని ముమ్మారుపలికి, నిలువఁబడి అధ్యక్షునకు నమస్కరించును. అంతటితో నతఁడుపాసకుఁడగును.

భిక్షువు కాఁగోరువానికిఁ గూడ నిట్టిక్రియమే ఏర్పరుపఁబడియున్నది. ఉపాసకుఁడు కాఁగోరువాఁడు చేయవలసినట్లే ఈతఁడును చేసిన పిమ్మట నతఁడధ్యక్షునికి నమస్కరించి, తానుదెచ్చిన యుపాయనమును సమర్పించి, అతనిని తనకుగురువుగా నుండుమని కోరును. అధ్యక్షుఁడందు కంగీకరించినంతనే యాటపాసకుని దూరముగా తీసికొనిపోయి, యాతనిమెడకు భిక్షాపాత్రమునుకట్టి, తిరిగి

యధ్యక్షుని మోౘలకు తీసికొని వత్తురు. అప్పుడు మరియొక భిక్షు వాతనిప్రక్క నిలువఁబడును. ఇద్దరుభిక్షువు లాతని వేరుగ దీసికొని పోయి, "నీపేరేమి? నీగురువు ఎవరు? నీవుభిక్షాపాత్రమును కాషాయములను ధరించినావా? నీకు అంటురోగముగాని, క్షయరోగముగాని, మూర్ఛారోగముగాని లేవుకదా? నీ కిరువదియేండ్లు వయస్సున్నదా? నీవు భిక్షువవగుటకు నీతలితండ్రు లంగీకరించిరా?" అని యడిగి, వాని వలన తగినయుత్తరమునుపొంది, తిరిగిసభలోనికి తీసికొనివచ్చి, యాతఁడుచెప్పినదానిని సభవారికెరింగింతురు. అప్పుడు భిక్షువుకాఁగోరువాఁడు, "భిక్షులారా! నన్ను సంఘములోచేర్చికొనుఁడు. నన్ను కరుణించి యుద్ధరింపుఁడు" అని ముమ్మారడుగును. అప్పుడు పరీక్షకు లాతనిని సంఘములోచేర్చికొనుటకు తమకునమ్మకములేనియెడల తెలుపుదురు. ఎవరునుమాట్లాడనియెడల వారు అధ్యక్షునకునమస్కరించి, "ఈతనిని సంఘములోచేర్చుకొన్నాము. ఫలానిభిక్షువు ఇతనికి గురువుగానుండును. సభవారి కిది అంగీకారముగనుకనే యూరకున్నారు. మేమట్లు బోధపరచుకొన్నాము" అనియందురు. అంతటితో నాతఁడు సంఘమునందు చేరును. అప్పుడు ఆసభవారిలోనొకఁడు సంఘముయొక్క విధులను చదువును. అంతటితో నా కార్యక్రమము ముగియును.

బౌద్ధధర్మమునశించుచు, సంఘసభ్యులు ధర్మాచరణమును నిరసించుచున్న సమయములతో సంఘపరిషత్తులు చక్రవర్తులపోషణక్రింద జరుగుచుండెను మగధరాజ్యమునకు ముఖ్యపట్టణముగనుండిన రాజగృహమనుపట్టణమందు బుద్ధుఁడు పరమపదమునొందిన సంవత్సరమున ప్రథమపరిషత్తు జరిగినట్లు సింహళపురాణములందు వ్రాయఁబడియున్నది మరియొకశతాబ్దమైనతర్వాత రెండవమహాపరిషత్తు వైశాలినగరమున జరిగెననియును, ఆసమయమున బౌద్ధధర్మమందు జొరఁబడిన కొన్నివిరు

ద్ధాంశములు సంస్కరింపఁబడెననియును తెలియవచ్చుచున్నది. ఓల్డెన్‌బ
ర్గువిద్వాంసుఁడు ఈవిషయమును విశేషముగపరిశోధించి మొదటిపరిషత్తు
కల్పితముగాని వాస్తవముగజరిగినదికాదని సిద్ధాంతీకరించెను. అశోకుఁడు
పట్టాభిషిక్తుఁడైన పదునెనిమిదవవర్షమున పాటలీపుత్రనగరమున మూఁడ
వపరిషత్తుజరిగెను. కాని, యీపరిషత్తునుగూర్చి శాసనసాక్ష్యము కాన
రాదు. అయినను సింహళపురాణమున ఈవిషయమై కొన్ని నమ్మఁదగిన
అంశములు కలవు. ఈతృతీయపరిషత్తునసమయమున మొగ్గలిపుత్త్రుఁడగు
తిస్సాయనుభిక్షువు అధ్యక్షతవహించెను. బౌద్ధసంఘమునఁజొరబడుచుం
డిన వైపరీత్యములు సంస్కరింపఁబడెననియును, అట్టిసంస్కారముల నను
సరించియే అశోకునిలఘుస్తంభశాసనములు లిఖింపఁబడియుండుననియును
విద్వాంసులయభిప్రాయము. అశోకునితర్వాత తిరిగి క్రీ-వె- మొదటి
శతాబ్దమువరకును సంఘపరిషత్తులనుజరిగించిన మహాప్రభువు లుండినట్లు
కానరాదు. ఆశతాబ్దమున కనిష్కచక్రవర్తి యాదరణముక్రింద ఒకపరి
షత్తుజరిగెననియును, అట్టిసమయమున వినయపిటకములకు దేశకాలాను
సారముగ భాష్యమొకటి తయారుచేయఁబడెననియును చీనాగ్రంథ
ములు పల్కుచున్నవి. అటుతర్వాత క్రీ- త- 7 వ శతాబ్దమువరకు
మఱియొకమహాసభ జరిగినట్లు కాన్పించదు. 7 వ శతాబ్దమున హర్షవర్ధ
నసార్వభౌమునికాలమున కొన్ని మాసములపర్యంతము ఒకమహాపరిషత్తు
జరిగినట్లు సమకాలికులవచనములవలన తెలియుచున్నది. అటుతర్వాత
భరతవర్షమున బౌద్ధసంఘము అనుమహాసంస్థ సంపూర్ణముగవిచ్ఛిన్న
మయ్యెను. సభలుజరుపువారే లేకపోయిరి.

చిలుకూరి నారాయణరావు.

# పీఠిక.

---

## 1 అశోకుని శాసనములు

ఈగ్రంథమున వివరింపఁబడిన శాసనములను ప్రకటింపఁజేయుటకుముందు అశోకవర్ధనుఁడు తనపూర్వీకుల నెవ్వరినిగాని యనుకరించినట్లు కాన్పించదు. అశోకమహారాజునకుపూర్వము భరతఖండమునేలిన ప్రభువులలో నొకరైనను శిలాశాసనములను నిర్మించినవారు లేరు. ఇఁక నీప్రభువునకు మార్గదర్శకు లెవ్వరైయుండిరనుప్రశ్నకుఁ దగినప్రత్యుత్తరము రావలసియున్నది. క్రీ. పూ. 4, 5 శతాబ్దములలో పరిషియాసామ్రాజ్యమున శాసనలేఖనము వాడుకలోనుండెను. ఈసామ్రాజ్యము భరతవర్షపు వాయవ్యమూలమున వ్యాపించియుండెను పర్షియావర్తకులు భరతభూమికిని, భారతవర్తకులు ఆదేశమునకును సరకులనుతీసికొని వ్యాపారముచేయుచుండిరి. పరిషియాదేశముతో సంబంధించిన అరమిక్ భాష మాతృకగాఁగలిగిన ఖరోష్ఠీలిపి మనదేశపువాయవ్యభాగములలో వ్యవహరింపఁబడుచుండెను. అట్లే ఫినీషియనులిపినుండిఉద్భవించిన బ్రాహ్మీలిపియైనను భరతదేశమున వ్యాపించియుండెను ఈరెండులిపులను అశోకుఁడు తనశాసనములలో నుపయోగించెను. ఈవాయవ్యప్రాంతమున తక్షశిలానగరము భరతఖండమున నత్యంతవైభవమున నలరారుచుండిన నగరములలో నొకటియై యుండెను. అచ్చటివిద్యాపరిషత్తులేమి, వ్యాపారరంగములేమి, కళాసౌష్టవమేమి, నానాదేశములనుండివచ్చు ప్రజలను వేనవేలుగఁ జేర్చుచుండెను ఇట్టి మహానగరమందు, తనతండ్రిరాజ్యకాలమున, రాజప్రతినిధిగనుండి, అశోకుఁడు ఈనూతనశిలాశాసనవిధానమున నేర్చికొనియుండవచ్చునని పలువురుశాస్త్రజ్ఞు లూహించుచున్నారు

ఈశాసనములకు ధర్మలిపులు, ధర్మశాసనములు, అను పేరులు కలవు. ఇవి యిప్పటికిదొరకినవరకును ముప్పదినాలుగుకన్న నెక్కువగ లేవు వీటిలో పెక్కులకు పాఠాంతరములుదొరకినవి. పాఠాంతములతోఁ గూడి మొత్తముమీఁద శాసనములన్నియును నూటముప్పదియైదుగ లెక్కింపఁబడియున్నవి. మూలములకును, పాఠములకును పదభేదములే గాక, పదలోపములుసైతము కలవు. అశోకునిచరిత్రకారులు కడుశ్రద్ధతో నీశాసనములనువితర్కించి, అశోకునిచే నుపయోగింపఁబడిన సాధనములనుబట్టి ఈకిందివిధముగ విభజించియున్నారు.

## (1) పదునాలుగు శిలాశాసనములు [1]

శిలలమీఁద చెక్కఁబడియుండుటచేత నీటికీనామ మొసఁగఁబడినది. వీటికిఏడుప్రతులు కలవు ఇవి కాల్సీ, గిరినగరము, షాబాజు, మన్సేహ , ధౌలీ, జౌగడా, సోపారాలలో దొరకినవి కాల్సీలోనిపదు నాలుగుశాసనములు సమగ్రముగనున్నవి. గిరినగరము (గిర్నారు), షాబాజు, మన్సేహ్రలలోని పదునాలుగింటిలో సంపూర్ణపాఠములు లేవు. ధౌలీ, జౌగడాలలోనివి మొదటి పదిశాసనములకు మాత్రమే ప్రతులై యున్నవి. సోపారాయందు కనఁబడినప్రతి యెనిమిదవశాసనమునకుమాత్రమే ప్రతిగనున్నది. ఈప్రతిలో కొన్నిశబ్దములుమాత్రము కాన్పించుచున్నవి.

పైస్థలములు చాలాపరకు దేశపు పశ్చిమభాగములలో నున్నవి. ధౌలీజౌగడాలు తూర్పుభాగమందలి ఓడ్రరాష్ట్రమందున్నవి. 2 భావిపరి

---

1 తనధర్మబోధనలు మొదటదూరప్రాంతములవారికిఅందవలయునని అశోకునిఅభిప్రాయమైయుండియుండెనేమోయనిపరిశోధకులు ఊహించుచున్నారు.

2 గ్రంథమున 1నుండి10౭వ పుటవరకు చూడుము.

శోధనలు ఇతరప్రాంతములలోఁగూడ ఈశాసనప్రతులను వెలిబుచ్చఁగల వని నమ్మవచ్చును.

ప్రథమశాసనము జంతుప్రాణ పవిత్రతను గూర్చి విశదీకరించు చున్నది. ఇదితనరాజనగరునందు భోజనార్థము కావింపఁబడుచుండిన జంతువధ నిషేధింపఁబడినవిషయమును స్పష్టపఱచుచున్నది. ద్వితీయశాసనమున మనుజులయొక్కయు జంతువులయొక్కయు సౌఖ్యమునుగోరి, అశోకుఁడు నానాప్రదేశములందుసలిపిన చికిత్సలు వివరింపఁబడినవి. తృతీయశాసనమున, తనరాజకీయోద్యోగులు పలుప్రాంతములలో నైదుసంవత్సరములకొకపర్యాయము సభలుజరిపి, మాతాపితృశుశ్రూష, పెద్దలయందుగౌరవము, అర్హులకు దానమొసఁగుట, జీవహింసాసిరసనము, ఇత్యాదిముఖ్యధర్మముల ప్రకటింప నాజ్ఞాపింపఁబడిరి. నాలవశాసనము ఈబౌద్ధధర్మమును పునశ్చరణముచేయుచు, రాజాడంబరములు విసర్జనీయములని నొక్కిచెప్పుచున్నది. అశోకుని భావిసంతతి వారు ధర్మమునభివృద్ధిచేయఁగోరుచున్నది. అయిదవశాసనమున అశోకుఁడు ధర్మమహామాత్రుల నియమించినవిషయమును, వారివిధులును తెలుపఁబడినవి. ఆఱవశాసనము ప్రతివేదకుల విధులఁగూర్చి తెలుపు చున్నది. ఏడవశాసనము, మానవులలోనియోగ్యతను హెచ్చించు మనశ్శుద్ధి, కృతజ్ఞత యనుగుణములను ప్రకటించుచున్నది. ఎనిమిదవశాసనమున అశోకుఁ డెట్లు మృగయావిహారమును విసర్జించి ధర్మయాత్రను అవలంబించినదియు లిఖింపఁబడినది. ప్రజలు తమతమకులాచారములను వదలక పైఁజెప్పిన ధర్మాచరణముసైతము సలిపిన సంకల్పసిద్ధులగుదు రని తొమ్మిదవశాసనము పల్కుచున్నది. ధర్మానుష్ఠానమువలన పారలౌకికపుణ్యము గలుగునని పదియవశాసనము తెల్పుచున్నది. పదునొకొండవశాసనమున ధర్మాచరణము అనఁగ నెద్దియో తిరిగివిశదీకరింపఁ

బడినది. పండ్రెండవది పరమతాచారసహిష్ణుత అవశ్యకమని బోధించు చున్నది. కళింగరాజ్యాక్రమణమునందు తానుగావించిన రుధిరపాతము నకును బహుజనసంక్షోభమునకును అశోకుఁడువగచుచు ధర్మవిజయము కన్న వేరొండువిజయములేదని నిశ్చయించి సర్వభూతములకును బాధ కలిగింపఁగూడదను అనుధర్మబోధను నానాదేశీయులకుఁ దెలుపఁబంచెనని యును వారందఱును ధర్మాచరణము ననుసరించుచున్నారనియును పదు మూఁడవశాసనమున వ్రాయించెను. పదునాల్గవశాసనము పైలేఖనము లన్నిటికిని ఉపసంహారవచనమై యున్నది

## కళింగశాసనములు.[1]

ఇవి రెండుమాత్రమే. ఈరెండును ఒరిస్సాలోని ధౌలీగ్రామమం దలి శిలమీఁదను గంజాముజిల్లాలోని జౌగడాగ్రామమందలి శిలమీఁ దను వ్రాయఁబడియున్నవి కళింగశాసనములకు ఈరెండుప్రతులుతప్ప మఱిలేవు. ప్రత్యేకరాష్ట్రీయశాసనముగ నివి పరిగణింపఁబడుచున్నవి. పైఁజెప్పిన ధర్మములఁగూర్చి ముచ్చటించుచు, కళింగవాసులకును తత్ప్రాంతమందలి ఆటవికులకును సుఖముఁగూర్చుటయు, వారిచేత ధర్మము నాచరింపఁ జేయుటయు మహామాత్రులవిధియని ఈశాసన ములు ఘోషించుచున్నవి. అంతియకాక ఈధర్మశాసనములను నాలు గుమాసములకొకపర్యాయము తిష్యానక్షత్రదినమునన్నైనను అంద ఱునువినుచుండవలయునను అశోకునికోరికను స్పష్టముచేయుచున్నవి. తిష్యానక్షత్రమనఁగా పుష్యమీనక్షత్రము. ఆధునికఒరిస్సారాష్ట్ర మును, గంజాంవిశాఖపట్టణగోదావరిజిల్లాలును పూర్వపుకళింగదేశ మునఁ జేరియుండెను. ఇచ్చటనుండిన తోసలి, సమవ యను ముఖ్యపట్ట

---

1 గ్రంథమున 88 నుండి 93 వ పుటవరకును. 100 నుండి 105 వ పుటవరకునుచూడుఁడు

ణములు శాసనములలోఁ జేర్పఁబడియున్నవి. సమపయనునది ప్రస్తుతపు సోంపేటగనుండియుండవచ్చునని ప్రాజ్ఞులు ఊహించుచున్నారు.

అశోకుని యీశాసనములకన్న పూర్వపుశాసనములు ఈప్రదేశమునఁ గాన్పించుటలేదు.

## III శిలాస్తంభశాసనములు.

* వీరశిలా స్తంభ నిర్మాణమునందుండిన అశోకుని యభిలాషను గూర్చి ముందుచెప్పియుంటిమి వీనియద్భుతశిల్పచాతుర్యమును, వీటి యౌన్నత్యమునజూచి యాశ్చర్యపొందని మానవుఁడు లేఁడు. వీటిఁబోలు స్తంభములు మరెచ్చటను గాన్పించుటలేదని మార్షలు అను ప్రఖ్యాత వాస్తుపరిశోధకుఁడువక్కాణించెను ఇట్టిబృహత్కాండస్తంభములపైఁ జెక్కించిన శాసనములు ఏడుమాత్రము కనఁబడుచున్నవి. ఇవన్నియును తోప్రాస్తంభముపైని వ్రాయఁబడియున్నవి. వీనిపాఠాంతరములు మీరటు, ప్రయాగ, లౌరియాఅరరాజము, లౌరియానందంగడము, రామపూర్వము అను నైదుస్థానములలోని స్తంభములమీఁదనున్నవి కాని యీయైదింటిలోను తోప్రాస్తంభముపైనున్న మొదటియారుశాసనములప్రతులుమాత్రమే వ్రాయబడియుండుటకును, అన్నిటికన్నప్రశస్తమైన యేడవదానిపాఠాంతరము కానరాకుండుటకును గారణమేమోయూహించుటకైనను వీలులేకయున్నది.

మొదటిశాసనమున శిలాశాసనములందువలె, ధర్మబుద్ధి, పరిపూర్ణవినయము, శుశ్రూష, అనురాగము, ఇత్యాదిగుణములుపరలోకసౌఖ్యప్రాప్తికి సాధనములనియు, తన యుత్తమ, మధ్యమ, అధమ అధికారులందఱును ధర్మపరిపాలనము చేయవలయుననియు అశోకుఁడు ప్రచు

* గ్రంథమున 107 నుండి 158 వ పుటవఱకు చూడుము.

రించెను. ధర్మము అనుదానికి నిర్వచనముచేయుచు, తానెట్లు దృష్టాంతయుతముగ ధర్మాచరణముగావించినదియు ద్వితీయశాసనమున నున్నది. తృతీయశాసనము ఆత్మపరిశోధనము ప్రతిమానవునకు అత్యావశ్యకమని తెల్పుచున్నది. రాజకీయోద్యోగులలో నుత్తములైనరజ్జుకులు ఎట్లు స్వకీయప్రవర్తనమువలనను, ధర్మోపదేశములవలనను, ధర్మవ్యాపకమొనర్పఁగలరో నాలవశాసనమున వివరింపఁబడినది

జంతువధగాని, పర్వదినములలో మత్స్యవిక్రయముగాని, విత్తులు తీయుట ఇత్యాదిజంతుహింసగాని తనరాజ్యమున జరుగఁగూడదని అయిదవశాసనమున విధింపఁబడెను. అశోకునికి ధర్మవ్యాపనమునందున్న శ్రద్ధనుగూర్చి ఆరవశాసనమునవ్రాయఁబడెను తనధర్మశాసనముల సారమనిచెప్పనగు ఏడవశాసనమున ప్రియదర్శిప్రభువు ధర్మవ్యాపనమునకై కావించిన యత్నములన్నియును క్లుప్తముగ వివరింపఁబడినవి. ధర్మోపదేశములుచేయుట, ధర్మానుశాసనములుప్రకటించుట, ధర్మస్తంభములను నిలుపుట, రజ్జుకులు ఆదిగాఁగల ఉద్యోగులద్వారా ధర్మవిషయమైన హెచ్చరికలుచేయించుట, నరపశుపక్ష్యాదిప్రాణుల సౌకర్యార్థము రాజమార్గమున వృక్షములను, బావులను, చలిపందిలులను స్థాపించుట, జంతువధనునిషేధించుట, ప్రభువుయొక్క స్వకీయదృష్టాంతయుతజీవనము అను నీ విషయములనుగూర్చియును, ధర్మవ్యాప్తికొఱకు తాను నియమించిన ధర్మమహామాత్రులు కావించు పనులనుగూర్చియును, ఈ శాసనము సూచించుచున్నది.

## IV స్తంభములమీఁదిలఘుశాసనములు.

* ఇందుమూఁడు_అనఁగా సార్నాథ, సాంచీ, కౌసాంబీ (కోసము) స్తంభములమీఁదివి— బౌద్ధసంఘమునుండి విడిపోయిన భిక్షుక

* గ్రంథమున 167 నుండి 181 వ పుటవఱకు చూడుము.

భిక్షుణులకు విధింపవలసిన అపరాధమునుగూర్చి తెలుపుచున్నవి. అట్టి వారికి దూష్యములైన తెల్లనిబట్టలనుకట్టి, వారిని మఱియొకస్థలమునకుఁ బంపివేయ వలయునఁట. అనఁగా బంగారురంగుగల కాషాయవస్త్రధారణమునకు వారు అర్హులుకారు. పదభేదములును విషయభేదములును వీటియందున్నను మొత్తముమీఁద ముఖ్యవిషయము ఒకటిగనున్న కారణమున నీమూటిని ఒకశాసనమునకు ప్రతులుగఁ బరిగణింపవచ్చును. ఈమూటిలోను సాంచి, కోసాంబీలలోనివి అనేకసంవత్సరములకిందటనే కనుగొనఁబడెను. కాని వాటిలోని ముఖ్యాంశము స్పష్టపడకుండెను. 1905 వ సంవత్సరమున సార్నాథశాసనము కనుగొనఁబడి, ఓగెల్ అను పండితునిచేతను, తర్వాత 1907 సంవత్సరమున సేనార్టుచేతను సంపూర్ణముగవితర్కింపఁబడఁగా పైరెండును సార్నాథశాసనమునకు పాఠాంతరములేయని తేలెను. కాని, సార్నాథశాసనము పైవాటివలెఁగాక, విపులముగను స్పష్టముగను గాన్పించుచున్నది. సంఘమునుల్లంఘించిన భిక్షుభిక్షుణులకు అపరాధమువిధింపఁబడుననియును, ఈయనుశాసనప్రతులను సంఘకార్యాలయమునందును ఉపాసకుల గృహమందును ఉంచవలెనని యును, రాజకీయోద్యోగులు శాసనమును వీక్షించుచుండవలెననియును వ్రాయఁబడియున్నది. ఈమూఁడుశాసనములును సంఘవిషయమును గూర్చి వ్రాయఁబడియున్న కారణమున అశోకుఁడు బౌద్ధసంఘపరిషత్తును జరిపినతర్వాత అచటఁగావింపఁబడిన తీర్మానమునే శాసనరూపముగ నిట్లుప్రకటించియుండవచ్చునని విద్వాంసులు ఊహించుచున్నారు.

స్తంభముమీఁది లఘుశాసనములలో మఱియొకటికలదు. అది కౌసాంబీ స్తంభముమీఁదనే చెక్కఁబడియున్నది. రాణీస్తంభశాసనమని పిలువఁబడుచున్నది రాణిగారుప్రకటించినదికాదు కాని, రెండవరాణియగు కారువాకిచే దానములుగానొసఁగబడిన వనములును గృహములును, ఆమెపేరటనే గణింపఁబడవలెనని దేవానాంప్రియుఁడే ఈశాస

మును వ్రాయించెను. శాసనమున తీవరకుతల్లియయిన కారువాకియను నామె సూచింపఁబడుటచేత, అశోకునకు ఇతరభార్యలుకలరని యూహింపనగును. పురాణగాథలలో అసంధిమిత్ర, తిష్యరక్షిత, అనువారలు మఱియిద్దరు అశోకునిభార్యలనియును, తిష్యరక్షిత కొనాలుఁడనిపేరు కునాలుఁడనియును గాన్పించుచున్నది. జలౌకుఁ డనునతఁడు మరియొక కుమారుడఁట. కాని గాథలలో నితనితల్లియెవ్వరో సూచింపఁబడలేదు. తీవర అను నతనినామము ఈరాణిశాసనమునఁదప్ప మఱియెచటను కనుపించుటలేదు. బహుశః అతఁడు తండ్రికన్న ముందుగ మరణించి యుండును.

# హిమవత్పర్వతపాదభూమియందలి స్తంభశాసనములు [1]

హిమవత్పర్వతపాదభూమి టెరాయిఅనుపేర వ్యవహరింపఁబడుచున్నది. కావున, పాశ్చాత్యవిద్వాంసులు ఈశాసనములను టెరాయి శాసనములని వ్యవహరించుచున్నారు. వీటిసంఖ్య రెండుమాత్రమే-లుంబినీ (రుమిండై) స్తంభముమీఁదిది ఒకటియును, నిగ్లీవియా (నిగిలీసాగర) స్తంభముమీఁదిది మఱియొకటియునునై యున్నవి. లుంబినీవనము బుద్ధునిజన్మస్థానమగుటచేత, అశోకుఁడు తీర్థయాత్రపరుఁడై యచటికి వెళ్ళి, తనయాత్రజ్ఞాపకార్థము స్తంభమునుస్థాపించి, లుంబినీగ్రామమును వారు పన్నులుచెల్లింపనక్కర లేదనియు, ఊరిపంటసాయములో అష్టభాగమునుమాత్రము చెల్లింపవలెననియు శాసించెను. అట్టితరిని, అశోకుఁడు దగ్గరనుండిన నిగిలీలోని కనకమునిస్తూపమును దర్శించి, దానిని అభివృద్ధి పరచెనని శాసనరూపముగ ప్రకటించెను. కనకముని, శాక్యమునిబుద్ధునికి పూర్వము అవతరించిన బుద్ధులలో నొకఁడు.

---

1 గ్రంథమున 165, 166 పుటలుచూడుము.

# గుహాశాసనములు.

1 గయాక్షేత్రమునకు పదునైదుమైళ్ళదూరముననున్న బారాబర్ కొండగుహాయందు దొరకిన మూఁడుశాసనములు ఈపేరున వ్యవహరింపఁబడుచున్నవి. ఈకొండకు ఖలితకపర్వతము అనుపేరుండినట్లు శాసనములవలన తెలియుచున్నది. ఇందొకగుహానామము న్యగ్రోధగుహయని కనుపించుచున్నది. అశోకుఁడు తన జ్యేష్ఠభ్రాతయైన సుమనుఁడను వానిని, తొలుదొల్తఁ జంపఁగా వతనిభార్య గర్భవతియైయుండి గత్యంతరములేక యొకమాలగూడెమున దాఁగియుండెననియును, అచట నామెకు న్యగ్రోధుఁడను పుత్రుఁడు జనించెననియును, ఈపుత్రుఁడు బాల్యదశయందే బౌద్ధభిక్షువై క్రమముగ అశోకునిగౌరవమునకు పాత్రుఁడై, అశోకునికి మోక్షమార్గము నుపదేశించెననియును, సింహళద్వీప వంశచారిత్రపురాణములలో వ్రాయఁబడియున్నది. అట్లైనచో, అశోకప్రభువు తనగురువుమీఁదిభక్తిచేత, నాగుహకు న్యగ్రోధగుహయను నామకరణము గావించియుండవచ్చునని యూహింపనగును లేక మఱ్ఱిచెట్లు విశేషముగా ఆతిప్పలమీఁదనుండియుండవచ్చును. ఈకారణమున న్యగ్రోధనామము ఆగుహకు ఒసఁగబడియుండవచ్చును.

పైమూఁడుగుహలను ఆజీవికులను తెగవారికి అశోకుఁడు దానమొసఁగినట్లు ఈశాసనములు తెలుపుచున్నవి. ఆజీవికులనుగూర్చి విశేషముగఁదెల్పు సాధనములు లేవు. వారు హఠయోగులనియును, దిగంబరులనియును 2 ఉపవాసములుచేయుటయం దెక్కుడుశ్రద్ధవహించువారనియును, పిపీలికాదిజంతుహింసనైను ఓర్వలేనివారనియును, కొన్ని

1 గ్రంథమున 181 182 పుటను చూడుము.

2 J. A. S. (Bengal) 1919. "wandeing teachers at the time of Buddha" an article by Bimala charan law.

బౌద్ధగ్రంథములలో ప్రస్తావనగాఁ దెలుపఁబడియున్నది. మధ్యమనికాయ
ముప్రకారము నందవశ్యుఁడు, కిశసంశిష్యుఁడు, మంకాళిగోశాలుఁడు అను
వారలు ఆజీవికమతమును స్థాపించిరి. గోశాలునిఁగూర్చి మాత్రము
కొన్నివిషయములు తెలియవచ్చుచున్నవి. జైనమతస్థాపకుఁడైన వర్ధ
మానమహావీరుఁడు, తనపూర్వాశ్రమమున నొకపర్యాయము తనగృ
హమువదలి దేశాటనముఁ గావించుచు మోక్షసాధనమునకుగాను తీవ్ర
తపస్సు సలుపుచు తనకుఁదగిన గురువుదొరకునాయని యాందోళనపడు
చుండగా, గోశాలుఁడు కాన్పించెను. వర్ధమానుఁడు గోశాలయోగికి
శుశ్రూషలుసలుపుచు కొన్నిసంవత్సరములు జరిపెను. తుదకు మోక్ష
సాధనసిద్ధాంతములందు గురుశిష్యులకు గొప్పవివాదము గలిగిందున,
వర్ధమానుఁడు గురువునువిడిచిపెట్టి మఱియొకమార్గ మవలంబింపవలసి
వచ్చెను. గోశాలయోగి తనహఠయోగమార్గమునువదలక స్వకీయమ
తమునుస్థాపించి తనయనుచరులను ఆజీవికులు (జీవత్వమునుజయించిన
వారు) అనుపేరఁ బిలుచుచుండెను. మహావీరునియనుచరులు నిర్గ్రంథు
లు (సంసారగ్రంథులనుండివిముక్తులు) లేకజైనులు (జినుని-అనఁగా
జయించినవానిశిష్యులు) అనుపేళ్ళఁబరగిరి. బౌద్ధులవలె జైనులును,
ఆజీవికులును గుహావిహారములలో మోక్షసాధనచేయుచుండెడివారు.
ఆజీవికులు, జైనబౌద్ధులవలె భూతదయ మోక్షమార్గమునకు మొదటి
సోపానమని నమ్ముచుండువారగుటచేత, కొందఱుశాస్త్రజ్ఞులు వారిని
బౌద్ధమతమునకు సంబంధించినవారనియును, మఱికొందఱు జైనులలో
నొకతెగవారనియును చెప్పుచున్నారు కన్నడదేశములో శాలివాహన
శకము 1076 వ సంసత్సరమున (అనఁగా) క్రీ. శ. 1154 వ సంవత్స
రమున) కర్ణాటకభాషలో వీరనందియనువానిచే రచింపఁబడిన "ఆచా
రసారము" అనుజైనగ్రంథమున ఆజీవికులనుగూర్చి కొన్నివిషయము
లుకలవు. వాటినిబట్టిచూడఁగా, 12 వశతాబ్దమునాఁటి(అనఁగా కళ్యాణ

చాళుక్యులయొక్కయు, యాదవులయొక్కయు రాజ్యకాలమునాఁటి) ఆజీవికులు, తమపూర్వికులవలెనే ఉపవాసములు విశేషముగఁ జేయుచు, అవసరమగునంతటి గంజిమాత్రము ఆహారముగపుచ్చుకొనుచు, పంచేంద్రియములను సంపూర్ణముగ వశపఱచుకొనుటకువలయు కఠినయోగసాధనములను ఆచరించుచుండెడివారని తెలియవచ్చుచున్నది. అంతియకాక, ఆకాలమున వారు బౌద్ధభిక్షువులలో నొకతెగవారుగఁ బరిగణింపఁబడుచుండినట్లు కాన్పించుచున్నది. ఇట్లు జైనులు ఆజీవికులను బౌద్ధులనుటయును, దీనికివ్యతిరేకముగా బౌద్ధులు వారిని జైనులలో నొకశాఖవారనుటయును, అశోకునికాలమునుండియును వచ్చుచుండెను. ఇట్లుండఁగా కొందఱుఆధునికశాస్త్రజ్ఞులు ఆజీవికులు ఒకవిధమగు హిందూమతసన్న్యాసులైయుండవచ్చుననుచున్నారు. కారణమేమనఁగా, వారు నారాయణభక్తులఁట. కాని, జైనులుసైతము నారాయణుని దైవముగ నమ్ముదురనుమాటను ఈపండితులు మఱచిపోవుచున్నారు. ప్రస్తుతకాలమున ఆజీవికశాఖలోఁజేరినవారు మనదేశమునఁ గాన్పించని కారణమున వారినిగూర్చి కొంచెమైనను దెలిసికొనుట అసాధ్యముగ నున్నది. పూర్వపుఆజీవికులు, డాక్టరుభండార్కరు ఉద్దేశపడుచున్నట్లు, బౌద్ధులలోఁగాని జైనులలోఁగాని చేరియుండక ప్రత్యేకమైన ఒకమతము వారైయుందురు. 1

పై మూఁడుగుహాశాసనములవలన అశోకునివరమతసహిష్ణుత విశదపడుచున్నది. వానితర్వాత రాజ్యమునకువచ్చినవాని మనుమఁడగు దశరథుఁడును ఆజీవికులకు నాగార్జునకొండలలోని మూఁడుగుహాలను ఇచ్చినట్లు అచ్చటిశాసనములు తెలుపుచున్నవి. ఈకొండగుట్టలు బారాబర్ గుట్టలకు సమీపమునయున్నవి. వాహ్యక, గోపిక, వేదాథిక అను

1 Ind. Ant, April 1912. Article by K. B. Pathak. Also J. Bomb. A. S. Vol, XXI pp. 403-405,

నామకులు ఈగుహాలకు ఉండినట్లు దశరథునిశాసనములలోఁ గాన్పించు చున్నది.

## బాభ్రాశాసనము.

*రాజపుత్రస్థానములో జయపురసంస్థానమునకుఁ జేరిన బైరాతు అనుపట్టణమునకు అనుకొనియున్న బాభ్రాగుట్టలమీఁది యొకగండ శిలపైని ఈశాసనము చెక్కఁబడియున్నది. ఈగ్రంథమున దీనిని బైరాతుశిలాశాసనము అనుపేర ప్రకటించితిమి ప్రస్తుతమిది కలకత్తాలో నున్నది. బుద్ధమహాముని స్వయముగఁ దర్శించిన కొన్నిధర్మవిషయములు బౌద్ధధర్మశాస్త్రములలో నున్నవి వాటినుండి, వినయసముత్కర్షము, ఆర్యవంశకోక్తి, అనాగతభయము, మునిగాథ, మౌనసూక్తి ఉపతిష్య (ఉపదేశ) ప్రశ్నము, రాహులవాదము అనుకొన్నిటిని ఈశాసనమునఁ బొందుపఱచుచు, అశోకప్రభువు సంఘమునఁ జేరియుండిన బౌద్ధులందఱును వాటినిగూర్చి వినుచు మననము గావింతురుగాకయని కోరెను. శాస్త్రోక్తులను పునరుక్తిగ నిట్లుప్రకటించినకాలమున అతఁడు సంపూర్ణభిక్షువై బైరాతువిహారములలో వాసముచేయుచుండెనుకాఁబోలు. ఈశాసనమును బౌద్ధాచార్యులకొఱకుఁ గావించినట్లు "ఆర్యులారా" యనుసంబోధనములు స్పష్టపఱచుచున్నవి.

## శిలలమీఁది లఘుశాసనములు.

* ఇట్టివి రెండుమాత్రము కలవు మొదటిది రూపనాథశిలమీఁద సంపూర్ణముగఁ జెక్కఁబడియున్నది. దీనికి అసంపూర్ణపాఠములు మఱిమూఁడుస్థానములలో నున్నవి. అవియేవి యన సాహాస్రము

---

* 171, 172 పుటలు చూడుము.

* 167 నుండి 181 వఱకున్న పుటలను చూడుము.

పట్టణము, బైరాతు, మస్కి, బ్రహ్మగిరి, సిద్ధపురము, జతింగరామేశ్వరము. ఈయేడుపత్రములను బోధించువిషయము. అశోకుఁడు బౌద్ధమతావలంబియైన తర్వాత రెండున్నరసంవత్సరములు ధర్మవ్యాపకముకొఱకు కొంచెమైనను కృషిసలుపలేదనియు, తర్వాత సంఘమునఁజేరి దానికొఱకు విశేషముగ పాటుపడెననియు ధర్మాచరణమువలన క్షుద్రునకయినను స్వర్గసౌఖ్యము ప్రాప్తించుననియును తెలుపఁబడియున్నది.

రెండవశాసనము విడిగనుండక, సిద్ధపుర, జతింగరామేశ్వర, బ్రహ్మగిరిశిలలమీఁది మొదటిశాసనపత్రములతోఁ జేర్పఁబడియున్నది. వాటిచివరనున్న అయిదారుపాదములు రెండవశాసనాంశములని తెలిసికొనవలెను. ఇందున్నవిషయముసైతము ధర్మాచరణమునుగూర్చినదే. మాతాపితలకువిధేయత, సమస్తజీవరాసులయందును అనురాగము, చిన్నవారియందు ప్రేమ, సత్యసంధత్వము అనునీధర్మములను ప్రజలాచరించవలెనని యిచట ఆజ్ఞాపింపఁబడియున్నది.

సిద్ధపురము, జతింగరామేశ్వరము, బ్రహ్మగిరి, అనునవి మైసూరురాష్ట్రములోనిగ్రామములు. ఇచటిశాసనపత్రములలో, సువర్ణగిరియందుండు అధికారులు, అశోకుని ఆజ్ఞానుసారముగ, ఇసీలాపురాధిపతులకు పైవిషయములు ప్రకటించినట్లు వ్రాయఁబడియుండుటచేత, ఇసిలాపురము సువర్ణగిరియధికారుల యేలుబడిక్రింద నుండెననియును, అశోకునిదక్షిణాపరగణాలకు సువర్ణగిరి ముఖ్యస్థానమై రాజప్రతినిధికి వాసస్థానముగనుండెననియును, ఈనగర మెచటనుండెనో యింకను పరిశోధకులు స్పష్టముగ కనుగొనలేకపోయినను, మైసూరురాష్ట్రమున నుండియుండవలెననియును తేలుచున్నది.

ఈమైసూరుశాసనములు దొరకకయుండినయెడల ప్రియదర్శి

లేకయుండును. అట్లే నైజాము రాష్ట్రములోని మస్కీగ్రామమందలి రమారమి 25 సంవత్సరములక్రిందట దొరకనియెడల దక్షిణాపథము లోని యీభాగముసైతము అశోకునిరాజ్యమునందుండెనా యనుసంశయము నివారణకాకయుండును. మస్కీశాసనమువలన ముఖ్యలాభమెట్టిదో ఆశాసనమునకువ్రాయఁబడిన ఉపోద్ఘాతమున సూచింపఁబడియున్నది. ఈశాసనమునం దొక్కదానియందే దేవానాంప్రియుఁడు అశోకుఁడని స్పష్టపఱుపఁబడియున్నది.

## శాసనములందుపయోగింపఁబడిన భాషాలిపులు.

అశోకునికాలమునందుండిన దేశభాషలలోనే తనశాసనములను ఆతఁడులిఖింపఁజేసినట్లు స్పష్టముగఁజెప్పనగును. వేదయుగమునాఁటి వేదభాష అశోకునికాలమునాఁటికి చాలమార్పులుచెందెను అంతియకాక స్థానికభాషలుపెక్కులు వ్యవహారములోనుండెను. ఇవి ప్రాకృత భాషలనియును, వానిలోముఖ్యమైనదియగు పాళీభాష ఉత్తరహిందూస్థానమున చాలవఱకు వ్యాపించియుండెననియును భాషావేత్తలు సిద్ధాంతీకరించియున్నారు. పాళీ ప్రాముఖ్యముగ అవంతి (ఉజ్జయినీ) ప్రాంతములలో జనసామాన్యసంభాషణములో వ్యవహరింపఁబడుచుండెను. పాటలీపుత్రనగరప్రాంతమందు వ్యవహారములోనుండినభాష మాగధీయనుపేరఁ బరఁగుచుండెను. మాగధీయనఁగా మగధరాజ్యస్థానమున వాడఁబడుచుండినభాషయని యర్థము. అశోకునిపెక్కుశాసనములు ఈభాషలోనే లిఖింపఁబడెనని శాస్త్రవేత్తలు నిర్ణయించియున్నారు. కాని, దూరప్రదేశముననుండు శాసనములలోనిభాష ఆయాప్రదేశములలోని స్థానికభాషలతో కొంతవఱకు మిశ్రమమైయున్నది. అట్లున్నను, మొత్తముమీఁద అన్నిశాసనములలోనిదియుప్రాకృతభాషాసంప్రదాయముకావున, ఏకభాషగాఁ బరిగణింపఁబడుచున్నది. ఈభాష

పాళీభాషవలెఁగాని, ఇతరప్రాకృతభాషలవలెఁగాని సంపూర్ణముగనందలి కారణమున, స్పష్టమగునర్థము నిచ్చుటలేదు.

శాసనములలోని లిపి సైతము సులభముగ, అవగాహనమగుట లేదు. ఒకటిరెండుశాసనములుతప్ప తక్కినవన్నియును బ్రాహ్మీలిపిలో నున్నవి. మిగిలినవి-అనఁగా-షాబాజుగఢీ, మన్సేహ్రాశిలాశాసనములు సిద్ధాపురలఘుశాసనములోని చివరభాగమును-ఖరోష్టియనులిపిలో వ్రాయఁబడియున్నవి. బ్రాహ్మీ, ఖరోష్టిలిపు లెట్లు భరతవర్షమునకువచ్చియుండెనో యనువిషయమునుగూర్చి డాక్టరుబుహ్లారు ఇత్యాదిశాస్త్రజ్ఞులు విశేషముగపరిశ్రమచేసి ఈవిధముగసిద్ధాంతీకరించిరి:—సెమెటిక్ దేశము (అనగానిప్పటిమెసపొటేమియా, సిరియాప్రాంతమున,) అనాదిగ అర్మియను, ఫినీషియను, అను రెండులిపులు వాడుకలో నుండెను. బ్రాహ్మీలిపి ఫినీషియనులిపిలోనుండియును, ఖరోష్టి అర్మీయనులోనుండియును, చీలినవి. మాతృకలనుండి మఱికొన్నిలిపులు సైతము ఉద్భవించెను. ఖరోష్టి, బ్రాహ్మీలిపులుమాత్రము సెమెటిక్ దేశములనుండి వచ్చుచుండిన ఫినీషియనులు మొదలుగాఁగల వర్తకప్రజలద్వారా భరతఖండమున క్రీ. పూ. 8 వ శతాబ్దమునకుపూర్వమే దూరియుండవచ్చును. ఖరోష్టి యితరసెమెటిక్ లిపులవలె, కుడిప్రక్కనుండి యెడమప్రక్కకు వ్రాయఁబడుచుండెను. కొన్నియపూర్వపునాణెముల సాక్ష్యమువలన, బ్రాహ్మీలిపి సైతము తొలుతొల్త అట్లేవ్రాయఁబడుచుండినట్లు తెలియవచ్చుచున్నది. కాని రాను రాను ఈపద్ధతిమారి, అశోకుని కాలమునాఁటికి బ్రాహ్మీలిపిమాత్రము యెడమవైపునుండి కుడివైపుకు వ్రాయఁబడుచుండినట్లు, అశోకునిశాసనములవలన స్పష్టముగఁగాన్పించుచున్నది. ఉత్తరహిందూస్థాన శాసనములలోఁగన్పట్టు బ్రాహ్మీలిపికిని, దక్షిణాపథములోని శాసనములందలి బ్రాహ్మీలిపికిని ఇంచుక భేదము కనుపించుచున్నది. ఉత్తరహిందూస్థానబ్రాహ్మీనుండి దేవనాగరలిపి

పుట్టినను ప్రబలసిద్ధాంత మొకటికలదు. అట్లే, బుహ్లారుపండితుని యభి ప్రాయముప్రకారము, దక్షిణాపథ బ్రాహ్మీలిపినుండి ద్రావిడలిపులగు. అరవ, తెనుఁగు, మలయాలలిపులు, జనించెనని పలువురు నమ్ముచున్నారు.

పై రెండులిపులకన్న అపూర్వమైనలిపులు మనదేశమునఁ గానవచ్చుటలేదు. లిపియను పనిముట్టులేక మనపూర్వికులు తమగ్రంథముల నెట్లురచియించియుండిరో యనుసందియము పొడసూపకమానదు. శ్రుతులైనవేదములు గీతములైనరామాయణాదిగ్రంథములును కంఠస్థముగవల్లింపఁబడి, పారంపర్యముగ వచ్చుచుండినకారణమున, అక్కాలపు వ్రాతప్రతులు లేవనిచెప్పవచ్చును. కాని గద్యాత్మకములగు బౌద్ధగ్రంథములు కొన్నియైనను 4 వ శతాబ్దమునకుపూర్వమునాఁటివి యుండియుండవలెను. అట్టివికాన్పించనందున వాటిలోనిలిపు లెట్లుండెనో ఊహించుటకైనను సాధ్యముకాకయున్నది. కావున మానవునకు తెలిసినంతవరకు, భరతభూమియందుపయోగింపఁబడిన వ్రాతలలో నీబ్రాహ్మీఖరోష్ట్రులే యతిప్రాచీనములని చెప్పవలసియున్నది.

# అశోకుని చరిత్రాంశములు

* మౌర్యవంశమునఁబుట్టి మగధరాజ్యలక్ష్మినిచేపట్టి, గంగాహిరణ్యావతీ (గండకీ) ల సంగమభూమిపైఁబెరిగిన పాటలీనగరసింహాసనమునధిష్ఠించిన పూర్వయుగపుసార్వభౌములలో ధర్మసంస్థాపనార్థము పేరుగాంచిన మహాపురుషుఁడు అశోకుఁడొక్కఁడే. ఇతనిపితామహుఁడు చంద్రగుప్త మౌర్యసార్వభౌముఁడు, తండ్రి అమిత్రఘాతుఁడను పేరువడిసిన బిందుసారుఁడు.

---

* గ్రంథమున 9 పుట చూడుము.

తనతండ్రి యవసానకాలమున అశోకుఁడు ఉజ్జయినీనగరరాష్ట్రమునకు యువరాజుగనుండినట్లు పురాణగాథలు చెప్పుచున్నవి. క్రీ. పూ. 273 వ సం॥ న బిందుసారుఁడు దివికేగఁగానే అశోకుఁడు చక్రవర్తి యయ్యెను. క్రీ. వె. 4-5 శతాబ్దములతో వ్రాయఁబడిన సింహళద్వీప వంశగాథలగు "దీపవంశ" "మహావంశ" పురాణములయందు, తనసోదరులఁ జంపి 'దుష్టాశోకుఁడు, లేక చండాశోకుఁడ'ను పేరువడసి తాను సింహాసనమెక్కెనని చెప్పఁబడియున్నవి. రాజ్యమునాక్రమించుకొను కార్యములోఁ గొంతరక్తపాతము జరిగియుండెనేమోకాని, అశోకుఁడు తనసోదరులనందఱినిఁ జంపెననుట విశ్వసనీయముగాఁదోఁచదు. కారణమేమనగా 1 తర్వాత అనఁగా క్రీ. పూ. 252వ సంవత్సరమునలిఖింపఁబడిన తనమైదవశిలాశాసనములోని 13 వ పంక్తిలో తనసోదరీసోదరులనుగూర్చి అశోకుఁడు ప్రస్తావనచేసియున్నాఁడు పైపంక్తిలో "ఓలోధనేసు భాతినం చ నే భగినినా ఏవా" (అవరోధనేషు భ్రాతృణాంచానే భగినీనామేవ) అను శబ్దసముదాయమునకర్థము "మాభ్రాతలయొక్కయు, అక్కసెల్లెండ్రయొక్కయు, ఇతరబంధువులయొక్కయు నగరములందు" అనిచెప్పఁబడుచున్నది. రెండవకారణమేమనఁగా, ప్రాణహింసయన్న దుస్సహముగఁ దోఁచెడి యీమహాపురుషుఁడు, తనపూర్వదశయందు, భ్రాతృహత్యాది ఘోరపాపములకొడిగట్టుకొనెనా? యని సంశయింపవలసియున్నది. సింహళద్వీపచారిత్రములలోసైతము, అశోకునిచే సుమనుఁడు మొదలుగాఁగల అన్నదమ్ములు చంపఁబడగా, తిష్యుఁడు అను ఒకతమ్ముఁడు మాత్రము హతుఁడుకాకనిలిచెనని చెప్పఁబడియున్నది. అంతియకాక క్రీ. త. 5వ శతాబ్దమున హిందూదేశమునకువచ్చిన చైనాయాత్రికుఁడైన హ్యూయన్ సాంగు అశోకునివిషయమును వివరించుచు అశోకునితమ్ముఁడైన మహేంద్రుఁడు సింహళమునకు వెళ్లెనని తెలిపియున్నాఁడు. మహేంద్రుఁడు, అతనితమ్ముఁడా, లేక, కుమా

రుఁడా యనువివరము ఇప్పటికిని నిర్ధారణకాకపోయినను, దివ్యావదాన గ్రంథములోఁగూడ సుసీముఁడు విగతాశోకుఁడు అనువిద్దరు అశోకుని సోదరులని వ్రాయఁబడియున్నది.

మరియుఅశోకుడు రాజ్యాభిషిక్తుఁడైనతర్వాతతనసోదరులనుగూరి దయాప్రేమరసములతో ప్రస్తావించెను. గాని, కరినోక్తులతో నేమియుచె ప్పనందునఁగూడ, తానుభ్రాతృహంతయై యుండఁడని నమ్మవచ్చును. కాని, తానురాజ్యమునకు క్రీ-పూ-273సం॥ నవచ్చియును, నాల్గుసంవత్స రములకాలము రాజ్యాభిషేకమున కేలకడవయ్యెనో సంశయింపవలసి యున్నది. ప్రాయశః, రాజనగరునందలి యల్లరులను అశోకుఁడు అడ చుటకు ఇంతకాలముపట్టియుండునని విన్సెంటుస్మిత్తుమొదలుగా గలచ రిత్రకారులు ఊహించుచున్నారు. అట్లైనయెడల, కొందరుసోదరులుకా కపోయినను, ఇతరబంధువులైనను, అశోకునిఖడ్గమువాతఁ బడియుందుర ని చెప్పవచ్చును. డాక్టరుజయస్వాలుపండితుఁడుమాత్రము ఈయభిప్రా యమును ఖండించుచు అశోకునికి 25సంవత్సరము లవయస్సు అప్పటి కింకనురానందున రాజ్యాభిషేకమున కాలస్యమయ్యెనని వాదించియు న్నాఁడు

అశోకుఁడు రా జ్యాభిషిక్తుఁడైనతర్వాత కొన్నిరాజబిరుదములను వహించెనని అతనిశా సనములవలనఁ దెలియుచున్నది. ఇందొకటి "దే వానాంప్రియ" యనునది. అనఁగాదేవతలకుప్రియుఁడైనవాఁడనియర్థము ఈదేవతలు సురలో భూసురులోయైయుందురు. మఱియొకబిరుదు "రాజాప్రియదర్శి" లేక "ప్రియదర్శిరాజ" అనునది సాధారణముగా,

---

↓ I. B. & O. R. S. 1917 Page 438 ప్రాచీనయుగమున ఇతర విధములైన అభిషేకములు, యువరాజ్యాభిషేకము, కుమారాభిషేకము, సేనాపత్యభిషే కము మున్నగునవిజరుగుచుండెను; వీటికినియమింపఁబడిన వయస్సులుఁ భేదించుచుండెను.

పైరెంటినికలిపి "దేవానాంప్రియదర్శిరాజ" యను దీర్ఘబిరుదమును అశోకుఁడు తనశాసనములలో నుపయోగించెను. అశోకునిపూర్వపు మౌర్యరాజుకూడ "దేవానాంప్రియ" యను ప్రాథవిశేషణమును వాడుకొనుచుండిరి. ప్రియదర్శియనుపదమందు గొప్పయర్థమేమియు లేదనియును, ప్రస్తుతకాలమున పాశ్చాత్యులు వాడుచున్న "మెజస్టీ" అనగా "ఘనమైనప్రభువు" అనుపదమునకు సరిపోలుననియును, సిల్వనులేవీయనుమహాపండితుఁడు అభిప్రాయపడెను. ఇట్లే క్రీ. వె. మొదటిరెండుమూఁడుశతాబ్దములలో మహారాష్ట్రమున రాజ్యముచేయుచుండిన, రుద్రదాముఁడు మున్నగుఁగల పశ్చిమక్షాత్రపులు "భద్రముఖ" యను బిరుదమును, అదేకాలములో దక్షిణాపథమందు రాజ్యముచేయుచుండిన గౌతమీపుత్రశతకర్ణిమున్నగు శాతవాహనులు "ప్రియదర్శన" యనుబిరుదమును వహించియుండిరి. విన్సెంటుస్మిత్తు, డాక్టరుకెర్నుమొదలుగాఁగల చారిత్రపరిశోధకులు పైఁజెప్పినయర్థముతో తృప్తిచెందక, ప్రియమైనదర్శనము లేక హృదయమునుకలవాఁడు అనునర్థము సరిగనుండునని సిద్ధాంతించిరి. సింహళద్వీపపురాణములలో నొకటైన దీపవంశమునందు ప్రియదర్శియనుపదము పౌరుషనామధేయముగ వాడఁబడియున్నది.

అశోకుఁడు రాజ్యాభిషిక్తుఁడైనతర్వాత మొదగియెనిమిదిసంవత్సరములు తానెట్టిరాచకార్యములనొనర్చెనో శాసనములమూలమునగాని గ్రంథములమూలమునగాని తెలియరాకున్నది. తొమ్మిదవసంవత్సరమున నాతడు కళింగదేశముపై దండెత్తెననియును, ఆవిజయయాత్రలో లక్షయేబదివేలమందిజనులు ఆదేశమునుండి లేటిమివేయఁబడిరనియును, లక్షమంది ప్రజలు యుద్ధమునహతులైరనియును, అంతకన్న నెన్నియోరెట్లు జనులు ఇతరకారణములవలన చనిపోయిరనియును అశోకుని పదుమూఁడవ శిలాశాసనము పల్కుచున్నది. కళింగరాజ్యము మగధరాజ్యమునకు

దక్షిణమునవున్న మహానదీప్రాంతములనుండి గోదావరీనదివఱకును వ్యాపించియుండెనని చెప్పవచ్చును తనయావజ్జీవమును విదితప్ప మఱే యేయుద్ధముగాని ఆప్రభువుకావింపలేదని యూహింపవలసియున్నది. కారణమేమున, ఆశాసనమందు, యుద్ధమువలనగలిగిన రుధిరపాతము నతువిలపించుచు తానిట్లు మనఃఖేదమును వెలిబుచ్చుకొనెను. "జయింపఁ బడని యొకరాజ్యమును జయించినపుడు జనులవధయును మరణమును ఇతరదేశములకుఁబంపబడుటయును జరుగుచున్నవనుట దేవానాంప్రియు నికి బాధాకరముగాను శోచనీయముగాను తోఁచుచున్నది. కాని, యీ క్రిందివి దేవానాంప్రియునికి మఱింతశోచనీయములు. అచటవసించు వారిలో...బ్రాహ్మణులు, శ్రమణులు 1 ఇతరశాఖలవారు, గృహస్థు లునగువారుందురు అట్టివారికి బాధయువధయును తమప్రియులగువారికి పరదేశగమనమును సంభవించును." "ఇంతకుముందుగలిగినజయము చాలును. క్రొత్తదేశములను జయింపనక్కఱలేదు పదంపడి అశోకుఁడు నూతనముగచేకూరిన రాజ్యమును సుభిక్షదశకుఁదెచ్చుటకుగాను వలయు పరిపాలనావిధమునుఅచటనెలకొల్పి,పాలకులుచేయవలసినవిధులను స్పష్ట పఱచుచు క్రీ. పూ. 256 సంవత్సరమున రెండుశాసనములనుఒకదానిని ధౌలీయనుగ్రామములోను రెండవదానిని జౌగడాగ్రామములోను నిర్మిం చెను. వీటిలోరాజప్రతినిధులును, రజ్జుకులును, దేశీయులను ఆటవికులను ఎట్లుపాలించవలయునన్నవిషయములను ప్రకటించెను. "తెలివిగలదాదికి బిడ్డనొప్పఁజెప్పి "ఈతెలివిగలదాది నాబిడ్డను బాగుగపోషింపఁగల"దని

---

1 సాధారణముగ శ్రమణశబ్దము పరివ్రాజకశబ్దమునకు పర్యాయపదముగ వాడఁ బడుచుండెను బౌద్ధమతమున శ్రమణులు తత్వమార్గమునుగూర్చి సదామననము చేయుచు, భౌతికప్రపంచవిషయములందు ఒకింతయైననుజోక్యము కలుగఁజేసికొనక మోక్షసాధన చేయుచుండెడివారు. వీరికి వర్ణాశ్రమధర్మము అనినగిట్టకుండెను. J. A. S. (Bengal) 1918 p 401

స్వస్థచిత్తముతో నుండునట్లు ఈరజ్జుకులును జానపదులహితముకొఱకును సౌఖ్యముకొఱకును నేను నియోగించియున్నాను.”

ఆయుగమున దేశమందంతటను పర్యటనముచేయుట బౌద్ధధర్మవ్యాపనము సలుపుచుండెడి భిక్షువులబోధనలకు వశుఁడై అశోకుఁడు బౌద్ధమతావలంబి యయ్యెను. కాని, గృహస్థధర్మమును తత్క్షణమేవిడిచిపెట్టలేదు. ఇట్లురెండున్నరసంవత్సరములు గడచినతరువాత “బౌద్ధమతమునవలంబించియు, బౌద్ధధర్మములను శ్రద్ధతోనాచరింపకపోతినిగదా” యని చింతించి, తాను బౌద్ధధర్మోపాసకవ్రతమును స్వీకరించినట్లు 1 కొన్ని శాసనములలోఁ జెప్పఁబడియున్నది. ఉపాసకవిధానమున జరుపుచు, క్రమముగబౌద్ధభిక్షువ్రతమునుస్వీకరించి మతవ్యాప్తికొఱకు అసామాన్యప్రయత్నములుసలుపఁదొడగెను. జీవయాత్రయందు ధర్మవిజయముకన్న వేరొండువిజయము బుద్బుదప్రాయమనియును, ధర్మవ్యాపనమునకై పలువిధములైనప్రబోధనములు కావింపవలయుననియును నిశ్చయించుకొనెను.

ఎన్నివిధములుగ ధర్మవ్యాపనము జరిపినను, అశోకుఁడు ఇతరమతములవారియందుగాని, యితరశాఖలయందుఁగాని విరోధాభావము చూపియుండలేదు. ఆకాలమున, పూర్వాచారపరాయణులగు బ్రాహ్మణులును, ఆజీవికులును, జైనులును, బౌద్ధులునుగాక కొన్నిచిల్లరమతములుసైతము ప్రబలియుండెను.

రెండవశిలాశాసనములోఁ జెప్పుకొనినట్లు “ప్రియదర్శిరాజు, సన్న్యాసులైననుసరే, గృహస్థులైననుసరే, సమస్తశాఖలవారిని దానముచేతను, వివిధపూజలచేతను” గౌరవించుచుండెను. అట్లే 9 వ శిలాశాస

1 మొదటిలఘుశిలాశాసనము – రూపనాథశిల – గ్రంథమున 168 వ పుటచూడుము.

2 24 వ పుటచూడుము

వమునసైతము 1 నానావిధశాఖలవారు ఆచరించుచుండిన వ్రతములం దు తనకు నిరాదరణములేనట్లు చెప్పకొనెను. కాని, అశోకుఁడు ముఖ్యముగబోధించిన విజ్ఞానమేమనఁగా-ఆత్మపాషండపూజ (ఒకశాఖవారు తమశాఖలను బొగడుకొనుట)యును, పరపాషండగర్హ్వము (ఇతరశాఖలనునిందించుటయు)ను ఈరెండునుగర్హ్వ్యములనువిషయము "అన్నివిధ్ములచేత పరశాఖలవారిని పూజింపవలయును. ఇట్లుచేసినయెడలతనశాఖవారి నభివృద్ధిచేయును, ఇతరశాఖలవారికిని ఉపకారముచేయును" అని 12 వశాసనమునందు తనపరమత సహిష్ణుతనువెలిబుచ్చెను. దీనికి తార్కాణముగ అశోకుఁడు ఆజీవికులకు మూఁడుగుహాల సర్పించినట్లు 2 గుహాశాసనములువల్కుచున్నవి. అదియునుగాక, బ్రాహ్మణులయెడల "అసంప్రతిపత్తి" (తిరస్కారభావము) చూపుట తనకుఇష్టములేనట్లునుక తన ధర్మవ్యాపనపద్ధతులవలన బ్రాహ్మణులయందు మర్యాదచూపఁబడుచున్నదనియును నాల్గవశిలాశాసనమున 3 స్పష్టపఱుపఁబడెను.

పరమతముల నిట్లుగౌరవించుచుండిన ఈచక్రవర్తికి అన్నిశాఖలవారిలోను బెరుగుచుండిన అధర్మప్రవర్తనలు గొప్పమనోవేదన గలిగించుచుండెను. నాల్గవశిలాశాసనమును, 4 కళింగశాసనములను 5 పరికించినయెడల, ప్రాణాలంభము (ప్రాణములను బలియిచ్చుట), విహింస (భూతములనుహింసించుట), జ్ఞాతులయెడ అసంప్రతిపత్తి (అమర్యాద,) శ్రమణులయెడలను, బ్రాహ్మణులయెడలను అసంప్రతిపత్తి అనునీ సాంఘిక, దురాచారములేకాక, సామ్రాజ్యములోని ఆయారాష్ట్రములలోఁగాన్పించుచుండిన అధర్మపరిపాలనముగూడ అశోకునిమనఃఖేదనమునకు గార

1 18 వ పుటచూడుము

2 181, 182 పుటలుచూడుము

3 7 8 పుటలుచూడుము

4 7 వ పుటను చూడుము

5 87, 88, 89 పుటలను చూడుము.

ణములని తెలియఁగలదు. జంతుబలిమాత్రమేకాక, కొన్నివిధములైన జనసమాజములుసైతము అశోకప్రభువునకు సహింపరానివిగనుండెనని 1 మొదటిశిలాశాసనమున తెలుపఁబడియున్నది. సమాజములు ద్వివిధములుగనుండెననియును, అందొకటియైన ఉత్సవకాలములందలి జనసమాహములు, జంతువులవధలతోను, త్రాగుడు ఇత్యాదిదుర్నీతులతోను చెలరేగుచుండినకారణమున నాచోట్లుగర్హ్యములని విశదముగ జెప్పఁబడియున్నది. రెండవవిధమైనజనసముదాయములు (అనఁగా కొంతవరకు దైవభక్తినివృద్ధిచేయు నాటకప్రదర్శనములకాలమున దేవాలయములలోఁజేరు సమాజములుకున్నగునవికాఁబోలు) సాధుసమ్మతములైయుండెను.

పైదురాచారములను అణఁగఁద్రొక్కఁ యత్నించుచు, ప్రజలధర్మప్రవర్తనమును, ప్రజలసౌఖ్యమును వృద్ధిగావింప బహుభంగులప్రయాసపడి దానికిఫలితముగా "జంబూద్వీపమునందు జనులతోగలసియుండని దేవతలను నేను జనులతోఁగలిపితిని" అని మొదటి లఘుశిలాశాసనములో అశోకప్రభువు జయవంతముగఁ జెప్పకొనెను. ఇట్టిపర్యవసానమునకుగాను తాను అవలంబించినమార్గములు ఎవ్వియన—బౌద్ధధర్మములనుబోధింపఁజేయుట, పరమతసహిష్ణుతఁజూపుచు, బౌద్ధసంఘమున మొలకయెత్తుచుండిన అనేకత్వభావమునుతొలఁగించి ఐకమత్యమును వర్ధిల్లఁజేయఁబూనుట, సర్వప్రజలకును, నోరులేని జంతువులకును సుఖము నిచ్చు సంస్థలనెలకొల్పుట, రాజ్యమునందంతటను న్యాయపరిపాలనము ధర్మవ్యాపనము, వ్యాపింపఁజేయుట.

ధర్మమనగానేద్ది! యనుప్రశ్నకు రెండవస్తంభశాసన 2 మున

---

1 1, 2, పుటలు చూడుము.

2 110, 111 పుటలను జూడుము.

జవాబుకలదు. "ధర్మమునందు పాపములుండవు; దయ, దానము, శౌచము, సత్యము, అను చాలకళ్యాణగుణములు అందుచేరియున్నవి." ఇంక ధర్మము నెట్లుఅనుష్ఠింపవలయును అనువిషయమును స్పష్టపఱచు రెండవలఘుశిలాశాసనములో, 1 తల్లిదండ్రులకు శుశ్రూష, ప్రాణుల యందుగౌరవము, సర్వజనులయందుప్రేమ, సత్యసంధత్వము ఇవి ధర్మ గుణములని నిరూపింపఁబడియున్నది. ఈముఖ్యములైన ధర్మనీతులు పెక్కుశాసనములలో పలుమారుపునరుక్తిగావింపఁబడియున్నట్లు చదువరులు సులభముగ గ్రహించగలరు

ఈమహాధర్మములు ఒక దేశమునకుగాని ఒకమతమునకుగాని ఒక కాలమునకుగాని ప్రత్యేకముగ నేర్పడినవికావు. అయినను, కాలవైపరీత్యములనుబట్టి, ప్రజలు అధర్మమార్గముల ప్రవర్తించుచుందురు. అట్టి సమయములలో అశోకునివంటిమహాపురుషులు, స్వయముగను, తమ యుద్యోగులద్వారాను, ధర్మనియమములను ప్రకటింపఁజేయుచుందురు ధర్మానుష్ఠానవిషయమున చిన్నవారుగాని పెద్దవారుగాని, తమశక్తికొలఁది పాటుపడుదురుగాకయని అశోకప్రభువు మనములకగుపునట్లు తెలియజేసికొనెను. ధర్మశ్రావణములను తనయుద్యోగులద్వారా, నానావిధప్రజలకు వినుపించెను. ధర్మగుణములనెట్టివో, ధర్మాచరణము వలనవచ్చు ఫలమెద్దియో మున్నగువిషయములను, శిలస్తంభాదిసాధనములమీఁద, శాసనరూపముగ, లిఖింపఁజేసెను.

ఈపద్ధతులతో తాను తృప్తిఁజెందక, ధర్మవ్యాపనార్థము నియమింపఁబడిన <u>దూతలను</u> (ధర్మోపదేశకులను) నానాదేశములకుఁబంప నాజ్ఞాపించెను. ఈసందర్భమున, అయిదుగురుఉపదేశకులు ఒక్కొక్కటిగా ఒకొక్కరాజ్యమునకు పంపఁబడిరి మధ్యముఁడు, కశ్యపుఁడు, మొగ్గలి

1 సిద్ధపురశిలాశాసనము కడపటిపంక్తులు, 178,179 పుటల జూడుము.

పుత్రుఁడు అగు తిస్సాయనునతఁడు, పేరుపడిన ఉపదేశికులైనట్లును, హిమవత్పర్వతప్రదేశములకుఁ బంపబడినవారిలో మధ్యమ, కాశ్యపగోత్ర దుందుభిస్వర రాజసుభిక్షువులును మఱికొందఱును జేరి యుండినట్లును. తక్షశిలారాష్ట్రమునకు వెళ్ళినవారిలో మధ్యాంతకుఁడును. మహిషమండలమునకుఁబంపఁబడినజట్టులో మహాదేవుఁడనునతఁడును ఉండినట్లును, సింహళపురాణగాథలవలన తెలియుచున్నది.

ధర్మోపదేశికులద్వారా "ఈలోకమంతెనిమిదిదిక్కులను యోజనశతములవఱకు వ్యాపించియున్న పరిసరప్రాంత దేశములందు" ధర్మవిజయముకలిగెనని అశోకుఁడు తనపదుమూఁడవ శిలాశాసనమున చెప్పెకొనెను. సిరియాదేశాధిపతియైన అంతియోకుఁడును (Antiochus of Syria) వానిరాజ్యమునకు ప్రక్కగనున్న ఈజిప్టుదేశాధీశుఁడైన తురమయుఁడును (Turamaya i. e Ptobmy of Egypt) మాకిడోనియా దేశప్రభువగు అంతికోనుడును (Antikini i. e Antigonus of Macedonia,) వీనికిలోబడియుండిన సామంతులును, సైరీనీదేశనాథుఁడగు మగుఁడును (Maka of Cyrene,) ఎపైరను దేశపతియైన అలికసుందరుఁడును (Alikasmndara i. e. Alexander of Epirus) వీరందఱును అశోకునిధర్మబోధనలను ఆమోదించినట్లు ఆశాసనమునందే స్పష్టపఱుపఁబడియున్నది. అంతే కాక, దరదులును, విషవజ్రులును, యవన కాంభోజులును, నాభకులును, నాభపంక్తులును, ఖోజులును, పితినిక్యులును, ఆంధ్రులును, పుళిందులును, మఱియితరులును, దేవానాంప్రియుని ధర్మోపదేశములను గ్రహించినట్లును తెలియవచ్చుచున్నది సింహళద్వీపమునకు తనసోదరీసోదరులగు (?) సంఘమిత్రమహేంద్రులనుబంపి వారిద్వారా అశోకుఁడాప్రదేశమున ధర్మప్రబోధముగావించినట్లు సింహళపురాణములలో వ్రాయఁబడియున్నది. వీరిరువురును గయలోని బోధివృ

క్షశాఖను గైకొని మహానందముతో సింహళమునకేఁగినట్లు సాంచీస్తూపము నానుకొనియున్న ఒకద్వారముపై చిత్రింపఁబడియున్నది.

ధర్మోపదేశకుల కార్యము అటుండగా, రాచకీయోద్యోగులైన యుక్తులును, రజ్జుకులును, ప్రాదేశికులును, మఱియితరులును, తమతమ మండలములందంతటను ఐదేసిసంవత్సరముల 1 కొకపర్యాయము తమ రాచకీయకార్యార్థగమనముననుసరించి ధర్మానుశిష్టికోసము ప్రయాణముచేయుదురుగాక యని ఆజ్ఞాపింపఁబడిరి. వీరు చేయవలసినకార్యములో వీరికిఁదగిన ప్రోత్సాహమును కలుగఁజేయుటకుఁగాను ధర్మమహామాత్రులు అనునూతనోద్యోగియులు అశోకునిపరిపాలనమున పదునాల్గో సంవత్సరమున నియమింపఁబడిరి.

ధర్మోపదేశకులకార్యము అటుండఁగా, రాచకీయోద్యోగులైన యుక్తులును, రజ్జుకులును, ప్రాదేశికులును, మఱియితరులును, తమతమ మండలములందంతటను ఐదేసిసంవత్సరములకొకపర్యాయము తమరాచకీయకార్యార్థగమనముననుసరించి 2 ధర్మానుశిష్టికోసము 3 ప్రయాణముచేయుదురుగాక యని ఆజ్ఞాపింపఁబడిరి. వీరుచేయవలసినకార్యములో వీరికిఁదగినప్రోత్సాహమును కలుగఁజేయుటకుఁగాను ధర్మమహామాత్రులు అనునూతనోద్యోగియులు అశోకునిపరిపాలనమున పదునాల్గోసంవత్సరమున నియమింపఁబడిరి.

---

1 నాల్గవ శిలాశాసనము—5 వ పుటచూడుము.

శాసనములోని "అనుసంయానం" అనుమాటకు "యానము లేక గమనముననుసరించి" యనియర్థము. యాత్ర మనగా రాచకీయకార్యములకై చేయవలసిన పర్యటనము అని యెఱుంగునది.

2 9-11 పుటలు చూడుము

3 అర్థశాస్త్రము, పుటలు 16, 20, 58, 273-239-247

ధర్మమహామాత్రులనుగూర్చి కొంత విపులముగఁజెప్పవలసి యున్నది. అశోకునికిపూర్వము ఈయుద్యోగులు ఉండియుండలేదనియు ను, తానే వీరిని నూతనముగసృష్టించెననియును, తాను ఐదవశిలాశాస నమున చెప్పుకొనెను. వీరికిసరివచ్చుఉద్యోగులు చంద్రగుప్తచక్రవర్తి కాలమున నుండిరనుటకు 2 కౌటిల్యునిఅర్థశాస్త్రములోని కొన్నిసూచన లున్నవి. అశోకునిసామ్రాజ్యములోని ముఖ్యమైనఆహారములలోను (అనఁగామండలములలోను),ముఖ్యమగునగరములలోనుమహామాత్రులు నియమింపఁబడినట్లు తెలియవచ్చుచున్నది. కోసాంబి, తోసలి, సమావ, సువర్ణగిరి, ఇసిల స్థానములలోని మహామాత్రులు అశోకునిశాసనము లలో సూచింపఁబడిరి. 1 నగరవ్యవహారకులను కొందరుమహామాత్రులు కళింగశాసనములలో పేర్కొనఁబడియున్నారు. 2 కౌటిల్యునిఅర్థశాస్త్ర మునఁ బేర్కొనఁబడిన పౌరవ్యవహారములవలె, ఈనగరవ్యవహారకులు ఆయానగరములలో న్యాయపరిపాలనముఁగావించుచుండినట్లు స్పష్టము గఁగాన్పించుచున్నది. 3 మొదటి స్తంభశాసనమువలన అంతమహామా త్రులు అను ప్రత్యేకోద్యోగులుండినట్లు తెలియవచ్చుచున్నది. వీరు బహుశః అర్థశాస్త్రమునఁజెప్పఁబడిన అంతపాలురు (అనఁగా సరిహద్దు ప్రాంతములమీఁది అధికారులు) అనువారితో సరిపోలుమరునవచ్చును. అంతపాలురకు విశేషఅధికారముండినట్లును, పౌరవ్యవహారకులకుఁగాని, కుమారరాజులకుగాని, రాష్ట్రపాలురకుగాని యిచ్చుచుండినవేతనము వారికిని ఇచ్చుచుండినట్లును కౌటిల్యునివచనములవలనఁ దెలియుచున్నది. కారణమేమనఁగా, పరరాజ్యములకుసరిహద్దుననున్న మండలములను కాపాడుట సులభసాధ్యమైనకార్యముకాదు. కావుననే అశోకుఁడు

---

1 83-84 పుటలు చూడుము.

2 అర్థశాస్త్రము పుట 20

3 109 వ పుటచూడుము

అంతమహామాత్రులవిషయమై చెప్పుచు "ధర్మపరిపాలనమును, ధర్మవిధానమును, ధర్మమార్గమునసుఖమునుగల్పించుటయును, ధర్మానుసారముగనాజ్ఞాపించెను. 1 బ్రాహ్మణులయొక్కయు ఆజీవికులయొక్కయు వ్యవహారములను జూచుచుండుటకై మఱికొందరుమహామాత్రులునియమింపఁబడిరి.

అశోకునిరాజ్యమున స్త్రీలగుణశీలములను వృద్ధిపఱచుటకుఁగాను ప్రత్యేకము స్త్ర్యధ్యక్షమహామాత్రు లనువారు నియమింపఁబడియుండినట్లు 1 పన్నెండో శిలాశాసనమునను ఏడవ స్తంభశాసనమునను సూచింపఁబడియున్నది స్త్ర్యధ్యక్షులనువారు మహాభారతమునఁగూడ పేర్కొనఁబడియున్నారు.

ఇట్లు అశోకుఁడు సామాన్యమహామాత్రులను ప్రత్యేకమహామాత్రులను నియమించి, ఆ యుద్యోగస్థానములకుఁ దగినట్టివిధముగ ధర్మానుష్ఠానమునుజరిపింప యత్నించెను. తమప్రదేశములలో ధర్మపరిపాలనముచేయుటయును, ధర్మోపదేశమునలుపుటయు, ధర్మసంస్థాపనమునందు యుక్తులుమున్నగు రాజకీయోద్యోగులకుఁ దగిన ప్రోత్సాహము నిచ్చుటయును, మహామాత్రుల ముఖ్యమైనవిధులైనను, దిక్కులేనిజనులకు ఆపదలు వచ్చినట్లైన వారియాపదలమాన్పి వారికి సుఖముకూర్చుచు, సమస్తశాఖలవారివ్యవహారములందువ్యాపృతులై యుండుట మఱింతముఖ్యవిధియై యుండెను. చక్రవర్తిచేప్రకటింపఁబడిన శాసనములను ప్రజలు ఆదరించుచుండిరో లేదో యనువిషయమును వారు కనుఁగొనవలసియుండెను. రాజ్యాధికారులచే అక్రమముగ విధింపఁబడు దండనలను వారు నివారించుచుండవలెను. అపరాధులై న్యాయముగ దండనకర్హులైనవారియెడలనైతము కరుణచూపుచు, తమకుధర్మమనితోఁచినపక్ష

1 24, 131 పుటలను జూడుము

మున, అట్టిదండనలను ధర్మమహామాత్రులు రద్దుపఱపవచ్చును. "ఖయిదీలు సంతానవంతులైయున్నయెడల వారికి ధనమిచ్చిపోషించుట, పిచ్చియెత్తియున్నవారినంకెళ్ళను తీయించుట, వృద్ధులైనవారిని కారాగృహవిముక్తులఁజేయుట" మొదలుగాఁగల ధర్మకార్యములను మహామాత్రులు నడపుటకు హక్కు గలిగియుండినట్లు 1 ఐదవశిలాశాసనమున విశదపఱుపఁబడియున్నది.

మహామాత్రులుసైతము తమవిధులను సమగ్రముగ నిర్వహింపకపోవచ్చునను భయముతో అశోకుఁడు ప్రతివేదకులను (అనఁగా చారులను) నియమించి వారిద్వారా మహామాత్రులచర్యలను కనుగొనుచుండినట్లు 2 ఆరవశిలాశాసనము సూచించుచున్నది. ఈవిషయము కళింగశాసనములలోఁగూడ సూచింపఁబడియున్నది.

అంతేకాక అశోకభూపతి స్వయముగ బౌద్ధసంఘసమావేశములఁ గావించుచు, తద్ద్వారా ధర్మవ్యాపనము చేయుచుండెను. పాటలీనగరమందు క్రీ. పూ. 247 సం॥ న బౌద్ధసంఘమహాపరిషత్తును జరుపనిశ్చయించి, తనరాజ్యమందలి నానాప్రదేశములందున్న భిక్షువులనురావించెను. ఈ మహాసభయందు బౌద్ధధర్మవిధులనుగూర్చిన కొన్నివివాదములు పరిష్కరింపఁబడినట్లు, సింహళపురాణములవలన తెలియవచ్చుచున్నది కాని యట్లుపరిష్కరింపఁబడిన అంశములెవ్వియో తెలియరాకున్నవి. సంఘధర్మముల నుల్లంఘించు భిక్షుణీభిక్షువులకు దూష్యములైన తెల్లనిబట్టలుకట్టి వారిని మఱియొకస్థలమునకు పంపివేయవలెనను అపరాధవచనములు స్తంభములమీఁద లఘుశాసనములలో పైసంఘమహాపరిషత్తులోని

---

1 10, 11 పుటలు చూడుము

2 12, 13 పుటల జూడుము

తీర్మానములననుసరించి 1 అశోకుఁడు లిఖింపజేసియుండునని కొందఱు విద్వాంసులు అభిప్రాయపడుచున్నారు. ఈమహాపరిషత్తుగాక, చిన్నచిన్న సంఘసభలు పలుమారు వేర్వేరుమండలములలోఁ గావింపఁబడుచుండెడివి. అట్టిచిల్లరసభలను తానే కాక, తనక్రింది రాష్ట్రాధికారులుగూడ జరుప వలసినట్లును, వాటిద్వారా ధర్మమును బోధించవలసినట్లును అశోకుఁడు శాసించెను. వివిధరాష్ట్రములందలి పరిపాలకులు అయిదుసంవత్సరముల కొకపర్యాయమును, తక్షశిలా ఉజ్జయినీ నగరములందుండు రాజప్రతి నిధులు మూఁడువర్షముల కొకపర్యాయమును ఈసభలను జరుపవలసి యుండెను.

బౌద్ధధర్మవ్యాపనమునకుగాను అశోకుఁడు ఏర్పఱచిన మఱికొన్ని యుపాయములు విచిత్రములైనవి. ఇవి 2 నాల్గవశిలాశాసనమున జెప్పఁ బడియున్నది. అందుముఖ్యములైనవి, విమానదర్శనము (విమానములను ఊరేగించుట), హస్తిదర్శనము (ఏనుగులను ఊరేగించుట), అగ్నిస్కంధ దర్శనము (అగ్నికుండమును జూపించుట) మఱియితరదివ్యరూపములను ప్రదర్శించుట. జనులు ఇట్టిమహావైభవముతోనిండిన దివ్యప్రదర్శన ములఁజూచుచు తద్ద్వారా సచ్ఛీలమును,ధర్మబుద్ధిని వృద్ధిపరచుకొందురని అశోకుఁడు ఊహించినట్లు స్పష్టముగఁదెలియుచున్నది. తాను శాసన ములోఁజెప్పకొనినట్లు "ఆట్లును, ఇతరవిధములను ధర్మాచరణము వృద్ధి చేయఁబడినది." విమానములనఁగా దేవరథములని బుహ్లరువిద్వాంసుఁ డును, స్తంభములమీఁదఅమర్పఁబడి కావలసినవైపునకుత్రిప్పుటకువీలు గనుండిన దారుభవనములని డాక్టరుభండార్కరుపండితుఁడును 3 అభి

1 Vincent Smith 'Asoka,(3rd Edition) p 55.

2 నాల్గవ శిలాశాసనము 7 వ పుటజూడుము.

3 Indian Antiquary 1913. pages 25—27 "Epigraphic Notes and Questions" by Dr. D. R. Bhandarkar

ప్రియపడిరి. ప్రాచీనబౌద్ధులనమ్మకమున దేవతలు భూలోకమునుదర్శించు చుండిరి. బుద్ధుడు కోరినపుడు వారు భూలోకమునకు దిగుచుండిరని బౌద్ధగాథలు చెప్పుచున్నవి. కావున విమానపదమునకు ఏయర్థమిచ్చినను విమానములు దేవతలకు ప్రీతికరములగువస్తువులని తేలుచున్నది. అట్టి విమానములను ప్రభువులునిర్మించి ఊరేగించుటవలన, ఆధునికకాలపు రథోత్సవములవలన ప్రేక్షకులయందు కలుగునట్టి ఉదారస్వభావము, భక్తి, ఇత్యాదిదైవీసంపద్గుణములు వృద్ధియగుననుగాఢనమ్మకము ఆకాలమున మిక్కిలివిశేషముగ నుండెననుటకు సందియములేదు.

ఇఁక హస్తిప్రదర్శనమువలని యుద్దేశముకూడ పైఁజెప్పినదేయని వేఱుగ చెప్పనక్కఱలేదు. బుద్ధజాతకములలో బుద్ధునికి "గజోత్తమ" యనుపేరుకలదు. మాయాదేవి ఒకానొకరాత్రి ఒకకలఁగనినట్లును, ఆ కలలో శ్వేతగజస్వరూపముధరించిన బోధిసత్వుఁడు ఆమెనుసమీపించి, కుడిప్రక్కగా ఆమెగర్భమునఁజేరినట్లును, బారహత్ సాంచీస్తూపముల వద్ద చిత్రింపఁబడిన శిల్పిచిత్తరువుల నిప్పటికినిచూడనగును. కాల్సీశిలకు కుడిప్రక్కను సైతము ఒకఏనుఁగుబొమ్మ చెక్కఁబడి ఆయేనుఁగుకాళ్ల మధ్యను "గజతమ" (గజోత్తమ) యనుఅక్షరములు చెక్కఁబడి యున్నవి.

అగ్నిస్కంధప్రభావమునుగూర్చి వితర్కించునపుడు జాతకముల లోని యొకకథ జ్ఞాపకమువచ్చును. నలుబదియవజాతకములోనిట్లున్నది. మారుడు ఒకగొప్పఅగ్నికుండమును సృష్టింపఁగా, దానిమీఁద బోధి సత్వుఁడు తిరుగుచు ఆకలిగొనియున్న యొకబుద్ధునికి ఒకకపాలమునం దిచ్చి, ఉపాదానమహిమనుగూర్చి విశేషముగ ప్రశంసించెనఁట. బౌద్ధ మతమునందు అగ్నికుండమునకుగలిగిన ప్రాశస్త్యమునకు ఈకథయేకారణము.

ముఖ్యోద్యోగులందఱును ధర్మవ్యాపకకార్యమునందు నియోగింపఁబడి తమకార్యమును నెఱవేర్చుచుండగా, అశోకచక్రవర్తి స్వయముగ దేశాటనముఁగావించి, ధర్మమార్గమునందు మార్గదర్శిగనుండవలెనను సంకల్పముతో నానాక్షేత్రములను దర్శింపబయలుదేరెను. జనులయొద్దకు నేనుస్వయముఁగాపోవుటయే నాముఖ్యమతమైయున్నది" అని [1] ఆఱవస్తంభశాసనమున తాను చెప్పుకొన్నట్లు తనక్షేత్రాటనములో నానావిధశాఖలవారిని దర్శించుచు, వారిని సన్మానపూర్వకముగ గౌరవించుచు జానపదులనుచూచి వారికి స్వకీయధర్మోపదేశము చేయుచునుండెను. కావుననే శాసనములలో ఆశోకునిక్షేత్రయాత్రకు ధర్మయాత్రయను పేరుకలదు. పూర్వకాలమున మృగయావిహారయాత్రలకై తనపూర్వులవలె తానునుబయలుదేరుచుండెననియును తాను పట్టాభిషిక్తుడై నపదియవయేట (క్రీ-పూ 259వసం॥) విహారయాత్రార్థము సంబోధినగరమునకు వచ్చి, యచట ధర్మయాత్రనుఁచేసెననియును, తనయాద్వితీయావస్థయే యెక్కువప్రీతికరమైనదనియును, తాను ఎనిమిదవశిలాశాసనమునఁ జెప్పుకొనియున్నాఁడు. సంబోధిపురమే బోధి, లేక బుద్ధగయ. కళింగయుద్ధమైన రెండవసంవత్సరమున ఈవిధముగ ధర్మయాత్రలు ప్రారంభింపఁబడినట్లు స్పష్టమగుచున్నది. ఇట్టిధర్మయాత్రలలో బుద్ధశాక్యమునిపాదస్పర్శముచే పవిత్రముకాఁబడిన మహాక్షేత్రములలో నుత్తమక్షేత్రమగు లుంబినీవనమును, తనరాజ్యాభిషేకకాలము ఇరువదియవసంవత్సరమున (అనగాక్రీ-పూ 249) అశోకచక్రవర్తిసందర్శించి దానిని స్వయముగపూజించినట్లును, ఆసంవత్సరముననే, బహుశః ఆయాత్రలోనే నిగిలీసాగరపుటొడ్డుననుండిన కనకము

1 122 వ పుటను జూడుము.

నిబుద్ధునిస్థూపమును పునర్దర్శనముఁగావించి పూజించెననియును 1 రుమిందై, నిగిలీ స్తంభ శాసనములు తెల్పుచున్నవి. లుంబినీవనమును సందర్శించినపుడు, తనవెంబడివచ్చుచుండిన తనగురువగు ఉపగుప్తుఁడు అశోకునిఁ జూచి "ఓమహారాజా! ఆభగవంతునిజన్మస్థానమిదియే" యని యన్నమాత్రన, అశోకుఁడుపులకాంకితుఁడై, అపరిమితానంద మొంది, ఆచట శిలాస్తంభ మొకదానిని స్థాపించి, దానిమీఁద గురువుగారి వాగమృతబిందువులను ప్రకటింపఁజేసెను. ఈమాటలను ఇప్పటికిని స్పష్టముగ చదువనగును. తరువాత అశోకుఁడు మఱియేయేమహాక్షేత్రములన పూజించెనో శాసనములవలన స్పష్టముగ తెలియుట లేదుకాని, సింహళపురాణము లను బట్టియు, స్తంభములున్నస్థానములనుబట్టియును, చరిత్రకారు లీవిషయమునుతర్కించి, ఈక్రిందిక్రమముగ అశోకుఁడు మహాక్షేత్రములసందర్శించెనని నిర్ధారణచేసియున్నారు. ఉపగుప్తునితోఁగలసి తాను కపిలవస్తు నగరముచేరెను. గౌతముఁడు తనశైశవదశనుగడపినది ఇచటనే. అచటనుండి వారు సారనాదమునకు వచ్చిరి. గౌతముఁడిట అనేకసంవత్సరములు గడుపుచు తనధర్మచక్రమును మొట్టమొదట త్రిప్పెను. అనఁగా-తనమతము మొదటవ్యాపింపఁజేసెను. అచటనుండి వారు బుద్ధునినిర్వాణస్థానమగు గయాక్షేత్రమునుజేరిరి. అటుతర్వాత వారు బుద్ధుఁడు సిద్ధిబొందినక్షేత్రమగు కుశినగరమును సందర్శించిరి. తాను దర్శించిన ముఖ్యక్షేత్రములలో పలువిధములగు దానములను ధర్మాదాయములనుగల్పించుచు, అశోకుఁడు తనయాత్రాస్మారకముగా శిలాస్తంభములను పాతించి వాటిపైన తనయాత్రావృత్తాంతములను లిఖింపఁజేసెను. అశోకునితీర్థయాత్రలో, తనవెంట తనపుత్రికయగు చారుమతియనునామె వెళ్ళియుండి, చివరకు నేపాళదేశప్రాంతమున నిలిచిపోయినట్లును, అచట తనభర్తపేరట దేవపట్టణము అను నొకనగరము నిర్మించుకొని

---

1 165, 166 పుటలను జూడుము.

బౌద్ధమతములను స్థాపించుచు, తనజీవయాత్రయంతయును ఒకభిక్షుణిగ అచ్చటనే గడిపినట్లును తెలియవచ్చుచున్నది.

బౌద్ధధర్మములలో ముఖ్యమైనవి భూతదయ, అహింస, తల్లిదండ్రులశుశ్రూష, పెద్దలయెడగౌరవము, అందరియెడ ప్రేమ, సత్యసంధత్వము, పరమతసహిష్ణుత యనువాటిని అశోకుఁడెట్లువ్యాపింపఁజేసినదియు ఇంతవరకుఁజెప్పియుంటిమి. పరులయెడప్రేమనుగూర్చి కొంచెమువిపులముగ నిచటఁదెలుపవలసియున్నది. ప్రేమయనుగుణము పరులకష్టములను బోకార్చుటకై చేయుకార్యములందు విదితమగును. మానవులేకాక జంతువులు సైతము ప్రేమకుపాత్రములు. ఈవిషయమున అశోకవర్ధనుఁడుగావించినకార్యములు వర్ణనాతీతములు. నోరులేనిజీవములను హింసించుటయున్న, మతముపేరటనో లేకభోజనార్థమో వాటినిచంపుటయును ఈకరుణామయునికి దుస్సహములుగదోచెను. ఈవిషయముపట్లఅశోకుఁడు కొన్నివిధములైనసమాజములను ఖండించెనని చెప్పియుంటిమి. అంతటితోతృప్తిఁజెందక, రాజనగళ్లలో ఆహారముకొఱకు కావింపఁబడుచుండిన నూర్లవేలుజీవజంతువులవధను రద్దుపఱచి, రెండునెమళ్లును ఒకలేడియుమాత్రము చంపఁబడవలెనని మొదటనిర్ణయించి ఆవల ఈనిర్ణయమునుసైతము కొట్టివేసినట్లు మొదటిశిలాశాసనమునఁదెల్పఁబడియున్నది. జీవహింసకుకారణమైనట్టి మృగయావినోదములనువిసర్జించి, అశోకుఁడెట్లు ధర్మయాత్రలనుప్రారంభించెనో యిదివరకేచర్చించియుంటిమి. అహింసావిధానము నాచరించుటయందు అతఁడుదారిచూపించుచు, తనరాజ్యమందెల్లెడలను ప్రజలుకాని కొన్నివిధములైనజంతువులను పక్షులను చంపకూడదనితనరాజ్యాభిషిక్తకాలము ఇరువదియాఱవ సంవత్సరమునఆజ్ఞాపించినట్లు ఐదవస్తంభశాసనము తెల్పుచున్నది. జంతువులచిత్రవధనుగూర్చి అశోకుఁడునియమించిన ధర్మనియమములు ఈశాసనమునయున్నవి. జంతువులను ఊఁకలోపెట్టి కాల్చకూడదు. నిరర్థకముగా అందలిజంతులను

నాశనముచేయుటకు, అడవులనుతగులబెట్టకూడదు. కొన్నిపర్వదినములం దుజంతువులవృషములను తీసివేయకూడదు. ఇంతకుపూర్వము వృషము లుఁతీయఁబడినగొఱ్ఱెలు, పొట్టేళ్ళు, పందులు మొదలగువానికి మరలవృషములను తీయఁగూడదు కొన్నిపర్వదినములలో గుఱ్ఱములకును, వృషభములకును చుఱకలు వేయఁగూడదు. ఇవిగాక వేఱికొన్ని నియమములున్నవి. కౌటిల్యార్థశాస్త్రమునఁగాన్పించు నియమములనుసరించి పైధర్మనియమములు నిర్మింపఁబడినట్లు 1 అశోకునిచరిత్రకారులు ఊహించుచున్నారు. ఇట్టిధర్మనియమములవలనను జనులయందు ఎక్కువధర్మవృద్ధికలిగి, జీవజంతువులకు బాధకలిగించుటయును, జంతువులనుచంపుటయును ఆగిపోయినదని అశోకుఁడు 2 ఏడవస్తంభశాసనములో సంతోషపూర్వకముగ చెప్పుకొనియున్నాఁడు. రోగముచేపీడింపఁబడుచున్న పశువులకుఁ దగినచికిత్సలు ఏర్పాటుచేయఁబడినట్లు రెండవశిలాశాసనము చెప్పుచున్నది. 3 మనుష్యచికిత్సయు, పశుచికిత్సయు తనరాజ్యమందును, సమీపముననుండిన యితరరాజ్యములందును ఏర్పాటుచేయుటకు దగినవసతులను అశోకచక్రవర్తి కల్పించెను. మానవులకును జంతువులకును ఉపయోగించు ఓషధులు, వేళ్లు, పండ్లును, ఎచ్చటెచ్చటలేవో అచ్చటనెల్ల అవితీసికొనిరాఁబడి నాటింపఁబడినవి. పశువులకును మనుష్యులకును ఉపయోగించునిమిత్తము మఱ్ఱిచెట్లును, మామిడితోటలును, మార్గములందు వేయించఁబడెను. అర్ధక్రోశమున కొకటిచొప్పున మెట్లు కలిగిననూతులు త్రవ్వించఁబడెను. అనేకవిరామగృహములును, పానశాలలును (చలివందిలలు) మార్గములందు నిర్మింపంబడెను.

---

1 Vincent Smith "Asoka" (3rd Edition)

2 131 వ పుటను జూడుము.

3 రెండవశిలాశాసనమును, ఏడవస్తంభశాసనమును జూడుము. (4, 130 పుటలు)

ఇంతియకాదు. దయార్ద్రహృదయుఁడైన యీచక్రవర్తినిరుపేదలనురక్షించుటకొఱకు వనగృహాదిదానములను విరివిగనేర్పరచినట్లు శాస్పించుచున్నది. చక్రవర్తిపేరట నొసగఁబడుదానములను, రాణుల పేటిదానములను, రాజపుత్రులుచేయుదానములను, దానగ్రహణార్హులగువివిధజనులకు పంచిపెట్టుటకుగాను "మఃఖ్యులు" అను గొప్పఉద్యోగస్థులు 1 నియోగింపఁబడినట్లు స్పష్టముగఁదెలియుచున్నది. ఈసందర్భమున అశోకునిరెండవరాణియగు కారువాకియనునామె ఒసఁగినఆరామగృహాదిదానముఁగూర్చిన రాణీస్తంభశాసనము కోసంబీస్తంభమున చెక్కఁబడియున్నది.

ఈవిధముగ అశోకమహారాజు తనసామ్రాజ్యమును ధర్మరాజ్యముగజేసి ధర్మవిజయముకొఱకు యావజ్జీవమును పాటుపడుచుండెను. తనపుత్రులును పౌత్రులును ఈవిధముగనే ధర్మవ్యాప్తికొఱకు పాటుపడుదురుగాకయని హెచ్చరించుచుండెను. ఫలితమేమనఁగా, బౌద్ధమతము భరతవర్షమున ఆసేతుహిమాచలపర్యంతము వ్యాపించుటయేకాక, దేశాంతరములకువెళ్లి, ప్రపంచమతమయ్యెను.

అశోకునిరాజ్యవిస్తీర్ణమునుగురించియు పరిపాలనావిధానమునుగూర్చియు ముచ్చటించుట అవసరము. తనపితామహుఁడగు చంద్రగుప్తమౌర్యునికాలమునాఁటి రాజ్యాంగపరిస్థితులు చాలవరకు అశోకునికాలమునసైతము ప్రబలియుండెనని రూఢిగచెప్పనగును. కాని, యీవిషయమున శాసనప్రమాణము విశేషముగలేదు. తనరాజ్యము, తనపితామహునిరాజ్యమునకన్న గొప్పదిగనుండినట్లు శాసనములవలన స్పష్టపడుచున్నది. పాటలీపుత్రనగరము ఖలతికపర్వతభూమి, కోసంబి, లుంబి

---

ఏడోస్తంభశాసనము-130 131 పుటలు చూడుము

రాణీస్తంభశాసనము-159 వ పుటను జూడుము

నీగ్రామమున, తోసలీసమపానగరములు కలిగిన కళింగము, సువర్ణగిరి, ఉజ్జయిని, తక్షశిలానగరము- ఇవి స్పష్టము గతపరిపాలనముక్రిందను న్నట్లు శాసనములవలన విదితమగుచున్నది. తక్షశిలకుఆవల యేదేశము లుండెనో అవి యెంతవఱకు అశోకునిపరిపాలనకు లోఁబడియుండెనో, విశదముగ తెలియదుకాని, పదుమూఁడవశిలాశాసనమునుబట్టి, తక్షశిలకుపశ్చిమోత్తరమున సామంతుయోనులు, కాంభోజులు, గాంధారులు అను ప్రజలప్రదేశము లుండినట్లు తెలియవచ్చుచున్నది. యోనదేశము
1 ఇప్పటికాబూలులోనుగాఁగల ప్రదేశమైయుండవచ్చును. కాంభోజ దేశము కాశ్మీరములోనిఉత్తరభాగము. గాంధారము సింధునదికి పశ్చిమమునసుండెను అకాలమున గాంధారములో తక్షశిలచేరియుండలేదు. కాశ్మీరము అశోకునిరాజ్యమున నిమిడియుండెననియును, కాశ్మీరదేశమునకు ముఖ్యపట్టణమగు శ్రీనగరమును అశోకుఁడు నిర్మించెననియును క్రీ. శ. పదకొండవశతాబ్దమునాఁటి "రాజతరంగిణి" లో, తద్గ్రంథకర్తయగు కల్హణుఁడు వ్రాసియున్నాఁడు. క్రీ. శ. 7వ శతాబ్దమునాఁటి చీనాయాత్రికుఁడైన హ్యూయాన్ త్సాంగు కూడ కాశ్మీరము అశోకునిపరిపాలనక్రిందనుండినట్లు వర్ణించియున్నాఁడు.

లుంబినిగ్రామ నిగిలివ స్తంభశాసనములనుబట్టి హిమత్పర్వతపాదప్రదేశము అశోకునిసామ్రాజ్యములోఁ జేరియుండినట్లు ఊహింపనగును. పదమూఁడవశిలాశాసనములో పేర్కొనఁబడిన నభకులు భకులక్తులు అనువారు ఆప్రదేశమునకు సమీపమునసుండినవారు. వీరును వీరికిసమీపమున వాసముచేయుచుండిన విషవజ్రులును అశోకుని అధ్యక్షతనుఒప్పుకొని, స్వరాజ్యమునసుభవించుచుండిన తెగలుగ నుండి

1 "Political History of Ancient India" by Raya chandari (pages 162-165.)

నట్లు దోఁచుచున్నది. విపవజ్రిలుఅనువారు ఒకటేతెగవారని 1 డాక్టరు భండార్కరుప్రభృతులును, విపఅనువారును. వజ్రి అనువారును వేర్వేరుతెగలనియును బుహ్లరువివిద్వాంసుఁడును, అభిప్రాయపడియున్నారు. వజ్రిలముఖ్యపట్టణము వైశాలీనగరము.

ఇఁక మగధకు తూర్పుననున్నప్రదేశము, అనఁగా యిప్పటిబంగాళాదేశము, అశోకునిరాజ్యమునఁ గలిసియుండెనా? 2 బౌద్ధగ్రంధమైన దివ్యావదానమందును, హ్యూయనుత్సాంగువ్రాతలలోను ఈప్రశ్నమునకు సరియైనజవాబులు కాన్పించుచున్నవి. పశ్చిమబంగాళములోఁ జేరిన కర్ణసువర్ణభూమియందును, తామ్రలిప్తిలోను, తూర్పుబంగాళములోఁజేరిన సమతటలోను, ఉత్తరబంగాళములోఁజేరిన పుండ్రవర్ధనప్రదేశమునను అశోకునిచేనిర్మింపఁబడిన స్తూపములు కాన్పించినట్లు హ్యూయనుత్సాంగు వ్రాసెను అస్సాములోఁజేరిన కామరూపమునందు తానట్టి స్తూపములను చూచినట్లు చెప్పలేదుకావున కామరూపము అశోకుని రాజ్యమునఁ జేరియుండలేదని చెప్పవచ్చును.

దక్షిణాపథమున నెంతవఱకు మౌర్యరాజ్యము వ్యాపించియుండెనో నిర్ణయించవలసియున్నది. మైసూరులోని ఉత్తరభాగమునుండిన బ్రహ్మగిరి, సిద్ధపురాదినగరముల దనుకనుండిన ప్రదేశము తనరాజ్యములో స్పష్టముగఁ జేరియుండినను అశోకుఁడు దానినిజయించినట్లు ఏలాటిప్రమాణములు లేవు తనపితామహునికాలమున వింధ్యపర్వతమునకు దక్షిణమునున్నప్రదేశము మౌర్యరాజ్యములోఁ జేరియుండలేదు. అట్లయినచో తనతండ్రియగు బిందుసారునికాలమున నది జయింపఁబడియుండవలెను. కాని, దీనికిఁగూడ ఎట్టిసాక్ష్యమును దొరకపోయినను,

---

1 "Inscriptions of Asoka" by Dr. Bhandarkar and Majumdar (part I p 53)

2 "Asoka" by Vincent Smith (3rd Edition) p 255

బింబిసారుఁడు విఖ్యాతపురుషుఁడును బలశాలియును నైనట్లును, అతని చెలిమి కొఱకు సిరియా, ఈజిప్టు దేశాధిపతులు రాయబారులను బంపుచుండిర నియును గ్రంథకారులు ఒప్పుకొనినవిషయమే. ఇట్టివీరుని కాలమున ఆప్రదేశము జయింపఁబడియుండనియెడ, కళింగయుద్ధముతప్ప మఱియే యుద్ధమును సంభవలేదని స్పష్టముగఁ జెప్పుకొను అశోకుని కాలమున నెట్లు జయింపఁబడియుండును? ఇఁక మైసూరులోని దక్షిణభాగమును, కళింగరాజ్యమునకు దక్షిణమునను న్నప్రదేశములును ఎంతవరకు మౌర్య రాజ్యముఁ జేరియుండెననుసందర్భమున భేదాభిప్రాయములు విశేషము గ బయలుదేరుచున్నవి. 1 ప్రొఫెసర్ యస్. కృష్ణస్వామిఅయ్యంగారు ఈవిషయమును చర్చించి, మౌర్యులు ఆశతాబ్దమున తిరునల్వేలిమండల ములోని పొదెయిల్ కొండలవరకు నుండినప్రదేశమును ఆక్రమించు కొనినట్లు మామూలార్ అనునొక ప్రాచీనద్రవిడకావ్యకర్త తనగ్రంథ మున వివరించెనని యును, అందువలనరాజ్యము ద్రవిడదేశములో చాలా భాగమువరకు కొలఁదికాలమైనను వ్యాపించియుండెననియును సిద్ధాంత ము చేసెను. ఈదక్షిణమౌర్యదండయాత్ర అశోకునికి పూర్వమే జరిగి యుండవలెనని కొందరువిమర్శకులయభిప్రాయము. ఏదియెట్లున్నను ఇదియొకవిపరీతమైనదాడి కాని, నిలకడయైనదేశాక్రమణము కాదని స్పష్ట ముగఁ జెప్పవచ్చును. అదియునుగాక, రెండవశిలాశాసనమునందును పదమూడవశిలాశాసనమునందును ద్రవిడరాజ్యములగు చోళ, పాండ్య, తామ్రపర్ణి, కేరళపుత్ర, రాజ్యములు అశోకునిపరిసరప్రాంతప్రదేశము లని చెప్పఁబడియున్నందున, అశోకునిరాజ్యముయొక్క దక్షిణపుసరి హద్దు ఈద్రవిడదేశములవరకు మాత్రమే వ్యాపించియుండెనని విశదము గ తెలియుచున్నది ఇచటిసత్యపుత్రరాజ్యము కూడ పైపరిసరప్రదేశము

1 "Beginings of South Indian History" by S Krishnaswami Iyengar (ch. II)

లవలె స్వతంత్రరాజ్యమై యుండెను. 1 కాంచీపురమునకు చుట్టునుండు ప్రదేశము అప్పటిసత్యపుత్ర లేక సత్యవ్రతరాజ్యమై యుండునని యొకవిద్వాంసుఁడును, అట్లుకాదు, 'సత్యవ్రతక్షేత్రనామము శాసనసాక్ష్యముప్రకారము కాంచీపురమునకు మాత్రమే వర్తించెనని యును, సత్యపుత్రరాజ్యము వేఱొకచోట నండి యుండవలెనని మఱియొకపండితుఁడును, పూనానగరము చుట్టునుండు సత్యపుత్రులను తెగలవారిప్రదేశమని ఇంకొకరును, అదియునుకాదు, సత్యపుత్రయనునది కోయంబుత్తూరుజిల్లాలోని సత్యమంగళము తాలూకాగల ప్రదేశమైయుండెనని యింకొకరును వాదించుచున్నారు. ఈవాదనలనుమించిన యొకయూహ నూతనముగ వెలువడినది. 2 ఈయూహప్రకారము, సత్యపుత్రులు అనువారు ఆంధ్రులని సిద్ధాంతీకరింపఁబడుచున్నది. అట్లయినచో, ఆంధ్రులు అశోకునియేలుబడిని ఒప్పుకొని సామంతులుగ నుండిరని యిప్పటివరకును అందరుగ్రంథకర్తలచే నమ్మఁబడుచుండినవాదము ఖండింపఁబడుచున్నదీ. ఆంధ్రరాజ్యముకూడ స్వతంత్రరాజ్యమైయుండినయెడల తూర్పుమూలలో అశోకరాజ్యము యొక్కదక్షిణపుసరిహద్దు కళింగరాజ్యములో అనఁగా గోదావరీముఖద్వారముతో ముగిసియుండెనని చెప్పవచ్చును.

పదమూడవ శిలాశాసనములో పుళిందులు, భోజులు, రాష్ట్రికులు, 'పితినిక్యులు, అనువారుకూడా సూచింపఁబడియున్నారు. పితినిక్యులు అనుమాట రాష్ట్రిక భోజులకిరువురికిని వర్తించువిశేషణపదమని

---

1 Cf Prof. S V. Venkataswara in J. R. A S 1918 p 541–42 Vide also Dr. Bhandharkar's viewin J. R. A S.1919 pp 581-584 & Vincent Smiths identification with Satyamangalam in his "Asoka" (3rd Ed ) p 161.

2 Cambridge-History of India Vol 1 p 599.

యున్న, దానికి పిత్రాగ్నితజీవనమును అనుభవించుచుండువారు అని అర్థ మనియును డాక్టరుభండార్కరు అభిప్రాయపడుచున్నాడు. భోజులు ఇప్పటిబీరారురాష్ట్రములోనుండినవారు. రాష్ట్రికులు తరువాతిరాష్ట్ర కూట, మహారాష్ట్రులపూర్వీకులు. ఇరువురును అశోకునిసామ్రాజ్యము లోనివారై యుండిరి. పుళిందులు, మత్స్య, వాయుపురాణములలో వింధ్యపర్వతప్రాంతవాసులని చెప్పఁబడియున్నది. వారిముఖ్యపట్టణము, ఇప్పటిభిల్సాకుసమీపముననుండిన పుళిందనగరము. ఈచర్యవలన తేలిన దేమనఁగా అశోకమహారాజ్యము పశ్చిమమున అరేబియాసముద్రము తీరమువరకును వ్యాపించియుండెను.

ఇంతవిస్తీర్ణముగలరాజ్యమును అశోకచక్రవర్తి యెట్లుపాలించు చుండెనను విషయము చర్చనీయము. కౌటిల్యుని అర్థశాస్త్రమునందు చెప్పఁబడిన మంత్రిపరిషత్తు అశోకునికాలమునఁగూడ వ్యవహారములోనుం డెననుటకు, మూఁడు, ఆరు శిలాశాసనములలోని 'పరిషత్' అనుమాటలు సాక్ష్యములని డాక్టరుజయస్వాలువిద్వాంసుఁ డూహించుచున్నాఁడు.

తాను ప్రకటించినఆజ్ఞలలో నెల్ల, తనయుద్యోగులు ఆయామండ లములలో సభలుగాఁజేరి ధర్మవ్యాపనముచేయవలెను అనుసూచనను బట్టి, అశోకుఁడు ఏకేశ్వరప్రభుత్వమును ఒప్పుకొనువాఁడుకాఁడని నమ్మ వలసియున్నది. శాసనములలోని సూచనఁవలన, పూర్వపురాష్ట్రియ ప్రభుత్వవిధానమును (Provincial system of government) సైతము అశోకుఁడు గౌరవించుచుండెనని తెలియుచున్నది. తోసలి, సువర్ణగిరి, ఉజ్జయినీ, తక్షశిలా రాష్ట్రములు రాచకుమారులయొక్క గాని, అర్యపుత్రులయొక్కగాని, అధ్యక్షతక్రింద పరిపాలింపఁబడుచుండి నట్లు శాసనములలోఁ గాన్పించుచున్నది. ఈనాలుగును నలుదెసలలోని

ముఖ్యములైనరాష్ట్రములు. మధ్యరాష్ట్రమగు పాటలపుత్రరాష్ట్రమును చక్రవర్తి స్వయముగ పరిపాలించుచుండినట్లు ఊహింపవలసియున్నది. అశోకునిరాష్ట్రాధిపతులకు లోబడి ఆయారాష్ట్రములలో ఇతరఅధికారులు కొందరుండినట్లు శాసనములలో గానవచ్చుచున్నది. ఇందుప్రాముఖ్యులు మహామాత్రులు, రజుకులు లేక రజ్జుకులు, ప్రాదేశికులు, యుతులు లేక యుక్తులు, రాజపురుషులు, ముఖ్యులు, ప్రతివేదకులు, అనువారుండిరి. (1) మహామాత్రులనుగూర్చి యిదివరకేచర్చించితిమి. (2) రజ్జుకులు (లేక లజూలు) అనువారెవరనువిషయమున తిరిగి భేదాభిప్రాయములుకలవు. రజ్జుకుడనగా,1 ఒకరాష్ట్రములోని రాజప్రతినిధియగు కుమారరాజుకన్న క్రిందిమెట్టునందు పరిపాలకుడని విన్సెంటుస్మిత్ గారి యభిప్రాయము. "నారజ్జుకులు లక్షలకొలది జనులతో సంబంధము (బాధ్యత) కలిగియున్నారు" అనియును, వారు "జానపదులకుహితమును సుఖమును గలుగజేయుచు వారిననుగ్రహముతో జూచెదరు" అనియును, జానపదులకు "బహుమానములనిచ్చుట, దండనలవిధించుట" యనునధికారము ఈరజ్జుకులకుండవలెనియును అశోకుడు 2 నాల్గవస్తంభశాసనమున స్పష్టముచేసెను. వీరికి ఉరిశిక్ష మొదలుగాగల దండనాధికారముండినట్లు తెలియుచున్నది. కావుననే "నాయాజ్ఞ దూరస్థులగురజ్జుకులకు చేరుటకై మూడుదినములు వ్యవధి పట్టునుగనుక యెవరికైనను కారాగృహవాసశిక్షగాని, మరణశిక్షగాని విధింపబడినప్పుడు వెంటనే యాశిక్షనుప్రయోగింపక, మూడుదినములవరకును వేచియుండవలెనని నేనువిధించియున్నాను" అని అశోకుడు రజ్జుకులవలన శిక్షనొందినవారికి కొంత వ్యవధి కలుగజేసెను.

1 Asoka" by Vincent Smith (3rd Ed ) pp 94.

2 166 వ పుటను జూడుము.

1 అర్థశాస్త్రమున "రజ్జులను"వారును, వారిలో "చోరరజ్జుకులు"అను వారును సూచింపఁబడియున్నారు (3) ప్రాదేశికులు లేక ప్రదేశికుల నువారు మండలాధికారులుగనుండియుందురు. మూఁడవశిలాశాసనమున మాత్రమే వీరినిగూర్చి సూచింపఁబడియున్నది 2 ప్రదేశ అనఁగా వార్త గావున ప్రదేశకులు వార్తాహారులై యుండవచ్చునని యొకవిద్వాంసుఁ డభిప్రాయపడుచున్నాఁడు అట్లైనచో అర్థశాస్త్రములోని ప్రదేష్టలతో నీప్రాదేశికులు సరిపోలుదురు. 3 ప్రదేష్టలవిధులలో ముఖ్యమైనవి, బలి ప్రగ్రహము (పన్నులనువసూలుచేయుట, పొగరుబోతులైనప్రజానాయ కులను అణచుటమున్నగుకార్యము), కంటకశోధనము (నేరములనుశోధిం చివిచారణచేయుట), చోరమార్గణము (దొంగలజాడలుకనిపెట్టుట), అధ్యక్షులయొక్కయు వారిప్రజలయొక్కయు దుర్నీతులనుఖండించుట యనునీనాలుగును అర్థశాస్త్రమునవివరింపఁబడియున్నవి. అధ్యక్షులనఁ గా మండలములలోనిచిన్నచిన్నభాగములకధిపతులు ఇట్టియధికారము లే ప్రాదేశికులకు సైతము ఉండియుండవచ్చును. (4) యుతులు లేక యుక్త లనువారుఁగూడ మూఁడవశిలాశాసనమున సూచింపఁబడియున్నారు కాని, వీరినిగూర్చిన విశేషాంశము లేవియును శాసనములలో లేవు. రజ్జు కులవలెను, ప్రాదేశికులవలెను, వీరు సైతము, అయిదువర్షములకొకసారి తమతమప్రదేశములలో నెల్లఁ దిరిగి ధర్మమును బోధించవలసియుండెను. కాని, వీరిరాజకీయవిధులెట్టివో యెచటను కానరావు, మానవధర్మశాస్త్ర మందు యుక్తులనువారు "ప్రనష్టాధిగతద్రవ్యము" ను (పోఁగొట్టుకొనఁ బడినఆ సిని) జాగ్రత్తచేయుకార్యమునందు నియోగింపఁబడినట్లు చెప్పఁ బడియున్నది. అర్థశాస్త్రములో, "సముదాయ" (అనఁగా రాజద్రవ్య

---

1 Arthasastra pages 60 and 234.
2 J. R. A. S 1915 page 97.
3 Arthasastra pages 142, 200, 217 & 222.

ము)ను అధికారములేకుండ ఉపయోగించుకొనినవారుగ, నియుక్తులు చెప్పఁబడియున్నారు. అశోకునికాలమునఁగూడ యుక్తులు సర్కారు కోశములను దొరికినఆస్తులను జాగ్రతగ కాపాడుకార్యమునందు నియుక్తులైయుండిన టూహింపనగును (5) రాజపురుషులు నాల్గవ స్తంభ శాసనములోఁ జేర్కొనఁబడియున్నారు 1 అర్థశాస్త్రములోఁగూడ పురుషులు లేక రాజపురుషులు అనువారు వివరింపఁబడియున్నారు. ఇట్టివారు రాజ్యములోని పలుప్రాంతములలో నియమింపఁబడిన వార్తాహారులై యుండవచ్చుననిది 2 విన్సెంటుస్మిత్తుగారు వ్యాఖ్యానముచేసిరి. (6) ప్రతివేదకులనువారు ప్రభువుచేనియమింపఁబడిన చారులు, 3 అర్థశాస్త్రమునందు చారులనుగూర్చి విశేషముగచర్చింపఁబడి యున్నది. ఆకాలమున చారులులేనిది రాజ్యపరిపాలనము క్షేమదాయకముగనుండుట అరుదుగనుండెను. "నేను భోజనముచేయుచున్నను, అంతఃపురములోనున్నను, గర్భాగారములోనున్నను, పల్లకిలోనున్నను, ఉద్యానవనముందున్నను ఎచ్చటనున్నను, ఏకాలమందైనను జనులవృత్తాంతమును నాప్రతివేదకులు నాకు తెలియఁజేయుచుండవలెను" అని ప్రతివేదకుల విధులనుగూర్చి అశోకుఁడు ఆరవశిలాశాసనమున లిఖింపించెను. రాజపురుషులు వార్తలనుబంపువారేకాని ప్రతివేదకులవలె రాజును ఏకాలమందైనను సందర్శించి వానికిరహస్యవార్తలను స్వయముగఁజెప్పునధికారముకల్గియుండినవారుకారని యూహింపవలసియున్నది. (7) ముఖ్యులు అనుఉద్యోగస్థులు ధర్మాదాయములపై అధికారులుగనుండిరి. ఏడవ స్తంభశాసనమున ఈవిషయము సూచింపఁబడియున్నది.

---

1 Arthasastra pages 59 &75.

2 "Early History of India" by V. Smith (3rd Edn.) p. 130.

3 Artha Sastra, Bk 1 ch 11 & 12 & 16.

ఈప్రకారముగా అశోకసార్వభౌముఁడు భరతవర్షమును 41 సం వత్సరములు పరిపాలించి క్రీ. పూ. 232 వ సంవత్సరమున దివికేగెను. అశోకు నికి ఇరువురుభార్యలైన నుండిరి 1 అందొకర్తె కారువాకి యనునామె పేరు ఒకశాసనమునందున్నట్లు మూం దేసూచించియుంటిమి. ఆమెకుమా రుఁడు తీవర యనునతనిపేరు ఆశాసనమందే యున్నది. బహుశః అశోకు నికి ఈభార్యయందును ఈకొమరునియందును విశేషప్రేమ యుండియుం డవచ్చును. కాని, తీవరనుగూర్చి అశోకునితరువాతచరిత్రలో ఏలాగా కాన్పించుటలేదు. తండ్రికిపూర్వమే అతఁడు కాలధర్మమునొందెనేమొ? సింహళపురాణములలోను, ఇతరబౌద్ధగ్రంధములలోను, అశోకప్రభువు నకు "అసంధిమిత్ర" "తిష్యరక్షిత" యను నితరభార్య లుండినట్లు చెప్పఁబడియున్నది. ఈప్రభువువెనుక తనమనుమఁడైన సంప్రతియను నతఁడు రాజ్యమునకువచ్చినట్లు పురాణగాథలు పల్కుచున్నవి కాని శాస నప్రమాణమేమియును గాన్పింపదు. ఇప్పటివరకు దొరకిన యితరశాస నములనుబట్టి మఱియొకమనుమఁడైన దశరథుఁడు రాజ్యమునకువచ్చి నట్లు తెలియుచున్నది.

## అశోకునిచే నిర్మింపఁబడిన కట్టడముల

సత్యధర్మపరిపాలనదక్షుఁడై, సమస్తప్రజలసుఖముకొఱకు పాటు పడుచుండియు, అశోకుఁడు శిల్పనిర్మాణములయందుసైతము విశేషాను రాగమును జూపించుచుండెను. పాటలీనగరమున తానుఅత్యద్భుతమైన రాజసౌధమును రాతితోకట్టించినట్లు స్పష్టముగ తెలియుచున్నది ఆరు వందలసంవత్సరములతర్వాత-అనఁగా క్రీ. త. అయిదవశతాబ్దమున చీ నా దేశమునుండివచ్చిన ఫాహియాను యాత్రికుఁడు, ఈభవనమునుజూచి

2 రాణీస్తంభశాసనము 159 వ పుటనుజూడుము.

విస్మయమొందె- ఆహా, ఈనగరును, ఈమందిరములను ఎవరో దేవకన్య
కలు-మానవాతీతులు నిర్మించినట్లున్నది. ఈకుడ్యములును ఈద్వారము
లును ఈచిత్రశిల్ప నైపుణ్యమును మానవునకసాధ్యమగునట్టివిగఁగాన్పిం
పవు, అనుచు పరవశత్వమొందెనఁట. ఇటీవల_అనఁగా 12 సంవత్సరము
లక్రిందట పార్సీవంశమునబుట్టిన రత్నతాతాగారి ద్రవ్యసహాయముపొంది
డాక్టరుస్పూనరు అనుగొప్పప్రాచీనవాస్తుపరిశోధకుఁడు పాటలీనగరపు
పాడుప్రదేశమును పరిశోధించుచు రమారమి నూరుస్తంభములుకలిగిన
యొకశిథిలమందిరమును కనఁగొనెను. అది అశోకునిసౌధములోని యొక
భాగమని నిర్ధరింపఁబడినది. శతస్తంభమందిరమునునిర్మించిన మహారాజు
యొక్క శిల్పకళాభిమానమునుకొనియాడుట సాధ్యమా! స్పూనరుపరి
శోధకుఁడును, పారసీకపరిశోధకులలో నగ్రగణ్యుఁడగు మోడీ ఇత్యా
దులును, ఇట్టినగరునునిర్మించుటయందు అశోకుఁడు పర్షియాదేశప్రభు
వుల ననుకరించెనని యూహించుచున్నారు. కారణమేమనఁగ, అశో
కునికిపూర్వకాలమున మనదేశమున రాతికట్టడములులేవఁట-నూరుస్తం
భముల మేడలు అంతకుపూర్వము పర్షియాదేశముఖ్యస్థానమగు పర్సి
పొలిసునగరమున నుండెనఁట. తనశిలాశాసనములను ప్రకటింపఁజేయు
టలో, పర్షియాదేశప్రభువుల పద్ధతులననుకరించినట్లు, ఈమేడనునిర్మిం
చుటయందుసైతము వాటిని అనుకరించెనఁట. కాని, యీసిద్ధాంతము
చారిత్రపరిశోధకప్రపంచమున నింకను స్థాయిగ నొప్పుకొనఁబడలేదు.
హైందవపరిశోధకులు దానిని నమ్ముటకువిలులేదని వాదించుచున్నారు.
ఏదియెట్లున్నను అశోకునిచేనిర్మితమైన మహాభవనముండెననుటకు సంది
యము లేదు.

రాజభవనముల నెగాక, బౌద్ధభిక్షువులకును, అజీవికులవంటి
యితరమతస్థులకును తానునిర్మించిన మఠములుసైతము కాలప్రవాహ

మహిమచేత రూపురేక శిథిలములై పోయినవి కాని, అజీవికులకొరకు తొల్వఁబడిన కొండగుహాలు గయాక్షేత్రముదగ్గిరనున్న బరాబరుగుట్టల మీఁద స్నిగ్ధమైనగోడలతో నిప్పటికిని ప్రకాశించుచున్నవి.

అశోకునిచే నిర్మింపఁబడినస్తూపములలో కొన్ని చెక్కుచెదరకుండ ఇప్పటికిని నిలువఁబడియున్నవి. స్తూపములు అనఁగా బుద్ధునియొక్కగాని బోధిసత్వులయొక్కగాని అస్థికలు పదిలముగనుంచుటకై యిటుకరాలతో అర్ధగోళాకారముగఁ గట్టబడిన కట్టడములు. ఉన్నతములై విశేషమైన వలయముగలిగి, విరాజిల్లు ఈస్తూపములచుట్టును భక్తులు ప్రదక్షిణములు సేయుటకు స్థలముండును. చుట్టుప్రాకారములుగూడ కొన్నిస్తూపములకున్నవి. కొన్నిప్రాకారములు రాలతోకట్టఁబడిన కంచెలుగనున్నవి. వాటికి నలువ్రక్కలను ద్వారము లుండును. స్తూపములపైభాగమునను, కంచెమీఁదను, ద్వారములమీఁదను శిల్పరచనలు కాన్పించుచున్నవి. అశోకునిస్తూపములు పెక్కులు తనసామ్రాజ్యమందంతటను నిర్మింపఁబడినట్లు కానఁబడుచున్నది. వీటిలో విఖ్యాతములైనవి భూపాలురాష్ట్రములోని సాంచీనగరము వద్దనున్న గుట్టలమీఁదనున్నవి. అందొకదానిలో మధ్యను కాశ్యపగోత్రుల యస్థికలుగలిగిన పెట్టెదొరకినది ఈస్తూపము రమారమి 55 అడుగులయెత్తుకలదై, 126 అడుగులవలయముకలిగి, శిల్పకారుని చాతుర్యరచనతో ప్రకాశించుచున్నది ప్రాకారద్వారములపైని చిత్రింపఁబడిన పలువిధములగు ప్రతిమలు బుద్ధునిజీవితమునుగూర్చినవియును, బౌద్ధచరిత్రమందలి యుద్ధములగూర్చినవియునైన విషయములను స్పష్టపఱచునవియునై యున్నవి. కాని, యివియన్నియును అశోకునితర్వాతి ప్రభువులు ఎవరో క్రీ. పూ. ఒకటిరెండు శతాబ్దములలో తయారుచేయించినట్లు ఊహింపఁబడుచున్నవి.

సాంచీస్తూపమునకు సరివచ్చు స్తూపము సంయుక్తపరగణాలలోని బార్హూతుగ్రామము పరిసరములం గానవచ్చుచున్నది. దీనికిసైతము రాతి కంచెయును కంచెకునలుప్రక్కలద్వారములును ఉన్నవి. వీటిమీఁద సింహము, ఏనుఁగు, జింక, కోఁతి, ఇత్యాదిప్రతిమలు అత్యంతమనోహరముగ చెక్కఁబడియున్నవి. మనుష్యప్రతిమలుఁకూడ అతినైపుణ్యముతోఁ దీర్పఁబడియున్నవి. ఈస్తూపము పైభాగమున దీపములుపెట్టుటకు అనేకగూళ్ళుకలవు.

అశోకుఁడు గొప్పనగరములనునిర్మించెను. అందొకటి నేపాళకనుమలోని పురాతనమైన మంజుపట్టణమునకు మారుగ నిర్మింపఁబడిన లలితపురము ఇప్పటికిని విరాజిల్లుచున్నది. తాను నేపాళప్రాంతమునకు తీర్థయాత్రార్థమైయేగినపుడు, అనఁగా రమారమి క్రీ. పూ. 249 సం॥ న నీపట్టణమును నిర్మించెను స్త్రీతో సందర్శనజ్ఞాపకముగ నిర్మించిన ఈపవిత్రపురమున తాను అయిదుగొప్పస్తూపములనుకట్టించెను. ఇవియిప్పటికిని రమణీయముగనున్నవి. వాయువ్యప్రాంతమందలి కాశ్మీర దేశమున అశోకుఁడు శ్రీనగరమునునిర్మించెను. ఈనగరము ఇప్పుడుకాన్పించదు. కాని, ప్రస్తుతము కాశ్మీరరాజ్యమునకు ముఖ్యస్థానమైన శ్రీనగరమునకు అనతిదూరముననున్న పాండురస్థానమనుగ్రామము అశోకునిపురముండిన స్థానమని చరిత్రపరిశోధకులు నుడువుచున్నారు

అశోకుఁడు కొన్నికాల్వలత్రవ్వించినట్లు శాసనప్రమాణముకలదు. క్రీ. వె 150 వ సం॥న, పశ్చిమక్షాత్రపులలో పేరుగాంచిన రుద్రదాముని చేప్రకటింపఁబడిన గిర్నారుశాసనమున నీవిషయము వర్ణింపఁబడియున్నది దీనిప్రకారము అశోకునిపితామహుఁడైన చంద్రగుప్తమౌర్యునికాలములోఁ గట్టించఁబడిన సుదర్శనసరస్సునకు కావలసిన పంటకాల్వలు సంపూర్తికాకపోయినందున, ఆకార్యమును అశోకుఁడు తనప్రతి

నిర్మితమగు రాజాతుపాస్సునిద్వారా, నమగ్రముగ జరిపించెనని తెలుప బడియున్నది. ప్రస్తుతకాలమున వానరస్సుగాని ఆకాలువలుగాని లేవు.

వీటియన్నిటికంటె ప్రకృతకాలమున విఖ్యాతిగాంచినవి అశోకుని శిలాస్తంభములు. ఇట్టివి తాను రమారమితొమ్మిదింటిని తనతీర్థయాత్ర జ్ఞాపకార్థము సారనాథు, తోప్రామీరటు, ప్రయాగ, రాంపూర్వా, లారియా, నందఘట్టము, సాంచి, సిగలీ, లుంబినీ ప్రాంతములలో పాతించెను. వీటియన్నిటిమీఁదను శాసనము ఎ లిఖింపఁబడియున్నవి. శిల్పరచనలు కలవు. వీటితలలు కమలాకారములుగఁ జెక్కఁబడి, వానిమీఁద సింహములు, గజములు ఇత్యాదిస్వరూపములు చిత్రింపఁబడియున్నవి. అన్నియును స్నిగ్ధములై ప్రకాశించుచున్నవి. వీటిలో సారనాథు శిలాస్థంభ శిరోభాగము ఒకటి యిప్పటికిని చెడకయున్నది. ఈశిరోభాగము గంటవలెనున్న కమలముమీఁద నాల్గుసింహములు నాల్గువ్రక్కల నొక్కుతెలచుకొని విజృంభించియున్నట్లును వానిమధ్య యొకశిలాచక్రమున్నట్లును తొల్పఁబడియున్నది. ఈశిల్పచాతుర్యము ప్రపంచమున మఱినెచ్చటను కనుపింటచులేదని వాస్తుశాస్త్రజ్ఞుఁడైన ఫెర్గుసన్‌గారు నొక్కివక్కాణించుచున్నారు. దీనినిగూర్చినయితరవిషయములు మన గ్రంథాంతరమున 162 వ పుటయందు వివరింపఁబడియున్నవి మిగిలిన స్తంభములనుగురించినవిషయములు 107, 135, 137, 149, 155, 160, 165, 166 పుటలలో విపులముగవ్రాయఁబడియున్నవి. ఇందలిశోప్రాస్తంభమిపుడు ఢిల్లీనగరముననున్నది. ఈయున్నతమైన స్తంభము అతిస్నిగ్ధమైప్రకాశించుచున్నది. ప్రస్తుతాభిప్రాయమేమనఁగా అస్సీరియాప్రాంతములలోదొరకిన యుత్తమమైనయినుమును కరుగఁబోసి యీస్తంభమునునిర్మించినట్లు కాన్పించుచున్నది. సాంచీగ్రామమువద్ద కాన్పించు రెండు స్తంభములు సాంచీస్తూపము ఉత్తరదక్షిణద్వారములకు చేరువగ

నున్నవి. మనగ్రంథమున వర్ణింపఁబడినది దక్షిణద్వారముకడ నున్నది ఉత్తరద్వారమువద్దనున్న స్తంభము నలువదియైదుఅడుగులు యెత్తుగలిగి శిరోభాగమున ఒకఋషినిలిచియున్నట్లు అతిరమణీయముగ చెక్కఁబడి యున్నది. అలహాబాదు లేక ప్రియాగలోనున్న స్తంభముమీఁద, అశోకునిశాసనములనానుకొని, క్రీ. శ. నాల్గవశతాబ్దమున గుప్తసామ్రాజ్యాధిపతియగు సముద్రగుప్తచక్రవర్తి తనదిగ్విజయమునుగూర్చి సంస్కృతాక్షరములతో లిఖింపించినశాసనమొకటి కలదు. సముద్రగుప్తునివిజయయాత్రాచరిత్రకు వలయు నాధారములు ఈశాసనమునఁ దప్ప మఱియొకచోట కాన్పింపవు నిగలీ స్తంభమును, లుంబినీ స్తంభము నురమూరమిపదుమూఁడు మైళ్ళదూరములోనున్నవి లుంబినీవనము ఇప్పుడునిర్మానుష్యమై పాడుపడియున్నది అనతిదూరమున పడారియా యను గ్రామమొకటి కలదు ఈగ్రామముప్రక్కనసున్న హిందూదేవాలయమునె రుమ్మిందైదేవాలయమని లోకప్రసిద్ధముగనున్నది. అందలివిగ్రములు అచ్చటివారు రూపదేవివిగ్రహమందురు రూపదేవిపదవికృతరూపమేరుమ్మిందేయైయుండనోపు. ఈదేవియే బుద్ధునితల్లిగు నగు మాయాదేవియని వ్యవహారగాధలుచెప్పుచున్నవి. ఈదేవి నిలువఁబడియున్నట్లును, కుడిచేతితో తనచిన్నికొమరుని పట్టుకొని ముందుకు తెచ్చుచున్నట్లును నలుదిక్కులనుండివచ్చిన నల్గురుదేవతలు ఆశిశువునకు స్వాగతమిచ్చుచున్నట్లును, ఆవిగ్రహమునఁ చెక్కఁబడియున్నది. కాని, యచటి పామరజనులు చమురు, సింధూరములను విశేషముగ ఆవిగ్రహము మీఁదపూయుచుండుటచేత విగ్రహముమీఁది చిల్లరశిల్పిచాతుర్యములు కాన్పించుటలేదు లుంబినీయనునామము మాయాదేవితల్లిపేరని టిబెట్టుబౌద్ధగ్రంథములలోఁ జెప్పఁబడియున్నది. ఇచటిశిలాస్థంభపుశిరోభాగము కాన్పించదు. ఒకానొకపుడు పిడుగుపడి ఆశిరోభాగము విఱిగిపోయెనని తెలియవచ్చుచున్నది. స్తంభముమీఁది శిలాలేఖనములో

ఆభాగము గుఱ్ఱపుస్వరూపముచే నలంకరింపఁబడియుండెనని స్పష్టముగఁ దెలుపఁబడియున్నది. మైసూరులోని సుప్రసిద్ధపరిశోధకులును, కీర్తిశేషులునైన టాబర్డుఫాదిరిగారు నాలుగుసంవత్సరములక్రిందట నేపాళరాజ్యాధికారులయనుమతి బడసి లుంబినీవనమును సందర్శించివచ్చి, పైవృత్తాంతమునంతయును లోకమునకు వెల్లడిచేసిరి.

ఇట్టిమహాత్కార్యములను సలిపి శిల్పవిద్యాదేవిని పోషించిన చక్రవర్తినామము చిరస్మరణీయము.



—.౦—

అశోకునిచరిత్రయందు శాసనము లెంతవఱకు ఉపయోగములై నదియు వివరించితిమి. అశోకునికరుణార్ద్రహృదయము బౌద్ధమతవ్యాపనమునకుఁ గారణమంటిమి కాని, యాప్రభువుయొక్క కరుణారసమునకు మితియుండెననుటకు సందియము లేదు. నృపాలుఁడైనవాఁడు దండనలకర్హులని న్యాయమూర్తులచే నిర్ణయింపఁబడిన దుష్టులను శిక్షించని యెడల, అతనికరుణ విషముగ పరిణమించును. కావుననే, మరణశిక్ష సైతము తనరాజ్యమున విధింపఁబడుచుండినట్లు శాసనములుసూచించుచున్నవి. ఇట్టి శిక్షలననుభవించువారిమీఁద రాజకృప కొన్నాళ్ళకు కలుగవచ్చును. అట్టిరాజకృపవలననే కాఁబోలు, తాను రాజ్యాభిషిక్తుఁడైనయిరువదియాఱుసంవత్సరములలో ఇరువదియైదుసారు కారాగృహవాసులు విడుదలచేయఁబడినట్లు ఐదవ స్తంభశాసనమునఁ జెప్పఁబడియున్నది ఆకారణముచేతనే, మరణశిక్ష మొదలుగాఁగల శిక్షలననుభవింపవలసినవారికి శిక్షలననుభవించుటకుపూర్వము మూఁడుదినములు వ్యవధికలుగఁజేయఁబడినట్లు నాల్గవ స్తంభశాసనముననున్నది. అశోకుని యుద్దేశమేమనఁగా అక్రమములు అధర్మములు చేసినవారికి శిక్షవాస్తవమేకాని, దుశ్శీలమే లేకుండినయెడల, శిక్షలుండవుసరిగదా, ప్రజలు సచ్ఛీలమును పెంచుకొనుచు దేవతలకు సమానులగుదురుకావున ప్రజలెల్లరును ధర్మనిరతులగునట్లు ఉదాహరణరూపముగాను, ఉపదేశముల ద్వారాను తెలియఁజేయుట రాజవిధియైయున్నది. ఈగొప్పనీతిని అశోకునిశాసనములు బోధించుచున్నవి.

దేశభట్ల లక్ష్మీనరసింహము.

# అశోకుని ధర్మశాసనములు.

## కాల్సీశిల

[ఈశాసనములు సంయుక్తపరగణాలలోని డెహ్రిడూన్ జిల్లా, చక్రితా తహశీలులోని యొకపట్టణమగు కాల్సీ యనుదానికి ఉత్తరముగ ఒకటిన్నరమైళ్ళదూరమున యమునానదికి పడమటిమొడ్డున నొకపెద్దశిలపై లిఖింపఁబడియున్నవి. ఈశిల 10 అడుగులపొడవుగను 10 అడుగుల వెడల్పుగను, అడుగున 8 అడుగుల దళసరిగను ఉన్నది. శాసనములు ఈశిలపై ఈశాన్యముఖమున నున్నవి. శిలకు కుడిప్రక్కను ఒక యేనుఁగు బొమ్మ చెక్కఁబడియున్నది.]

### మొదటిశిలాశాసనము : కాల్సీ.

#### 1. కాల్సీశిలకు తూర్పుముఖమున.

1. (1) ఇయం ధంమలిపి దేవానంపియేన పియదసినా లేఖితా (2) హిం దానో కిఛి జివే ఆలభితు పజోహితవియే

2. (3) నో పి చా సమాజే కటవియే (4) బహుకా హి దోసాసమా జసా దేవానంపియే పియదసీ లాజా దఖతి (5) అధి పి చా ఏకతియా సమాజా సాధుమతా దేవానంపియసా పియదసినా లాజినే

3. (6) పులే మహానససి దేవానంపియసా పియదసినా లాజినే అనుది వసం బహుని పాతసహసాని అలంభియిసు సుపఠాయే (7) సే

—.o.—

అశోకునిచరిత్రయందు శాసనము లెంతవఱకు ఉపయోగములై నదియు వివరించితిమి. అశోకునికరుణార్ద్రహృదయము బౌద్ధమతవ్యాపన మునకుఁ గారణమంటిమి కాని, యాప్రభువుయొక్క కరుణారసమునకు మితియుండెననుటకు సందియము లేదు. నృపాలుఁడైనవాఁడు దండనల కర్హులని న్యాయమూర్తులచే నిర్ణయింపఁబడిన దుష్టులను శిక్షించని యెడల, అతనికరుణ విషముగ పరిణమించును. కావుననే, మరణశిక్ష సైతము తనరాజ్యమున విధింపఁబడుచుండినట్లు శాసనములుసూచించు చున్నవి. ఇట్లు శిక్షలననుభవించువారిమీఁద రాజకృప కొన్నాళ్లకు కలుగవచ్చును. అట్టిరాజకృపవలననె కాఁబోలు, తానురాజ్యాభిషిక్తుఁ డైనయిరువదియారుసంవత్సరములలో ఇరువదియైదుసార్లు కారాగృహా వాసులు విడుదలచేయఁబడినట్లు ఐదవస్తంభశాసనమునఁ జెప్పఁబడి యున్నది ఆకారణముచేతనే, మరణశిక్ష మొదలుగాఁగల శిక్షలననుభ వింపవలసినవారికి శిక్షలననుభవించుటకుపూర్వము మూఁడుదినములు వ్యవధికలుగఁ జేయఁబడినట్లు నాల్గవస్తంభశాసనమునను న్నది. అశోకుని యుద్దేశ మేమనఁగా అక్రమములు అధర్మములు చేసినవారికి శిక్షవాస్త వమేకాని, దుశ్శీలమే లేకుండినయెడల, శిక్షలుండవుసరిగదా, ప్రజలు సచ్ఛీలమును పెంచుకొనుచు దేవతలకు సమానులగుదురుకావున ప్రజ లెల్లరును ధర్మనిరతులగునట్లు ఉదాహరణరూపముగాను, ఉపదేశముల ద్వారాను తెలియఁజేయుట రాజవిధియైయున్నది. ఈగొప్పనీతిని అశో కునిశాసనములు బోధించుచున్నవి.

దేశిరాజు లక్ష్మీనరసింహాము.

# ఉపసంహారము

—.o —

అశోకునిచరిత్రయందు శాసనము లెంతవఱకు ఉపయోగములైనదియు వివరించితిమి. అశోకునికరుణార్ద్రహృదయము బౌద్ధమతవ్యాపనమునకుఁ గారణమంటిమి కాని, యాప్రభువుయొక్క కరుణారసమునకు మితియుండెననుటకు సందియములేదు. నృపాలుఁడైనవాఁడు దండనల కర్హులని న్యాయమూర్తులచే నిర్ణయింపఁబడిన దుష్టులను శిక్షించని యెడల, అతనికరుణ విషముగ పరిణమించును. కావుననే, మరణశిక్ష సైతము తనరాజ్యమున విధింపఁబడుచుండినట్లు శాసనములుసూచించుచున్నవి. ఇట్లు శిక్షలననుభవించువారిమీఁద రాజకృప కొన్నాళ్ళకు కలుగవచ్చును. అట్టిరాజకృపవలననే కాఁబోలు, తానురాజ్యాభిషిక్తుఁడైనయిరువదియారుసంవత్సరములలో ఇరువదియైదుసార్లు కారాగృహవాసులు విడుదలచేయఁబడినట్లు ఐదవ స్తంభశాసనమునఁ జెప్పఁబడియున్నది ఆకారణముచేతనే, మరణశిక్ష మొదలుగాఁగల శిక్షలననుభవింపవలసినవారికి శిక్షలననుభవించుటకుపూర్వము మూఁడుదినములు వ్యవధికలుగఁ జేయఁబడినట్లు నాల్గవ స్తంభశాసనమునన్నది. అశోకుని యుద్దేశమేమనఁగా అక్రమములు అధర్మములు చేసినవారికి శిక్షవాస్తవమే కాని, దుశ్శీలమే లేకుండినయెడల, శిక్షలుండవుసరిగదా, ప్రజలు సచ్ఛీలమును పెంచుకొనుచు దేవతలకు సమానులగుదురు కావున ప్రజలెల్లరును ధర్మనిరతులగునట్లు ఉదాహరణరూపముగాను, ఉపదేశములద్వారాను తెలియఁజేయుట రాజవిధియైయున్నది. ఈగొప్పనీతిని అశోకునిశాసనములు బోధించుచున్నవి.

దేశకట్ల లక్ష్మీనరసింహము.

ఇదాని యదా ఇయం ధంమలిపి లేఖితా తదా తింని యేవ పానాని అలభియంతి

4. దువే మజూలా ఏకే మిగే సే పి చూ మిగే నో ధువే (8) ఏతాని పి చు తిని పానాని నో అలాభియిసంతి

సంస్కృతము.

(1) ఇయం ధర్మలిపి ర్దేవానాంప్రియేణ ప్రియదర్శినా లేఖితా (2) ఇహా న కశ్చి జ్జీవ ఆలభ్య ప్రహోతవ్యః (3) నాపి చ సమాజః క ర్తవ్యః (3) బహూ కాన్ హి దోషాణ్ సమాజస్య దేవానాంప్రియః ప్రియదర్శీ రాజా పశ్యతి (5) స న్త్యపి చైకే సమాజాః సాధుమతా దేవానాంప్రియస్య ప్రియదర్శినో రాజ్ఞః (6) పురా మహానసే దేవానాం ప్రియస్య ప్రియదర్శినో రాజ్ఞో ఽ నుదివసం బహూని ప్రాణసహస్రా ణ్యాలప్సత సూపార్థాయ (7) తదిదానీం యదా ఇయం ధర్మలిపి ర్లేఖితా తదా త్రియ ఏవ ప్రాణా ఆలభ్య న్తే, ద్వౌ మయూరౌ ఏకో మృగః, సోఽపి చ మృగో న ధ్రువః (8) ఏతే పి చ త్రయః ప్రాణా నాలప్స్య న్తే.

తెనుఁగు.

(1) ఈ ధర్మశాసనము దేవతలకు ప్రియుఁడగు ప్రియదర్శి చేత వ్రాయబడ్డది (2) ఇచట (అనగా ఈలోకమందు) జీవజంతువులను చంపఁగూడదు, బలియివ్వకూడదు (3) ఉత్సవములకోసము జను లొొకచోట గుంపుగా చేరకూడదు. (4) అట్లు చేరుటవల్ల చాలాదోషములు దేవతాప్రియుఁడయిన ప్రియదర్శికి కనబఁడుచున్నవి (5) రాజును దేవతాప్రియుఁడును అయిన ప్రియదర్శి సాధుసమ్మతములని తలంచే కొన్ని ఉత్సవములు లేకపోలేదు. (6) పూర్వకాలమందు రాజును దేవతాప్రియుఁడును అయిన ప్రియదర్శివంటఇంటిలో నూర్లును వేలును జీవజంతువులు కూరకోసము దినదినమును చంపఁబడుచుండేవి. (7) కాని, ఈధర్మశాస

సము లిఖించఁబడ్డకాలమున దినమునకు రెండునెమళ్లును, ఒకలేడియు (ఆలేడికూడా నిత్యమూ చంపబడడము లేదు) ఇట్లు మూఁడుప్రాణులు మాత్రమే చంపఁబడుచున్నవి. (8) ఇఁక ముందు ఈమూఁడుప్రాణులనుకూడా చంపకూడదు.

---

రెండోశిలాశాసనము: కాల్సీ.

4 (1) సవతా విజితసి దేవానంపియసా పియదసినా లాజినే యే చ, అంతా అథాచోడా పండియా సాతియపుతో కేలలపుతో తంబపంని

5. అంతియోగే నామ యోనలాజా యే చా అంనే తసా అంతియోగసా సామంతా లాజానో సవతా దేవానంపియసా పియదసినా లాజినే దువే చికిసకా కటా మనుసచికిసా చా పసుచికిసా (2) ఓసధీని మనుసోపగాని చా పసోపగాని చా అతతా నథి

6. సవతా హాలాపితా చా లోపాపితా చా (3) ఏవమేవా ములాని చ ఫలాని చా అతతా నథి సవతా హాలాపితా చా లోపాపితా చా (4) మగేసు లుఖాని లోపితాని ఉదుపానాని చా ఖానాపితాని పటిభోగాయే పసుమునిసానం

సంస్కృతము.

1. సర్వత్ర విజితే దేవానాంప్రియస్య ప్రియదర్శినో రాజ్ఞో యే చాన్తా యథా చోడాః పాణ్డ్యాః సత్యపుత్రః కేరలపుత్ర స్తామ్రపర్ణీ అన్తియోకో నామ యవనరాజో యే చాన్యే త స్యాన్తియోకస్య సామన్తా రాజానః సర్వత్ర దేవానాంప్రియస్య ప్రియదర్శినో రాజ్ఞో ద్వే చికిత్సే కృతే మనుష్యచికిత్సా చ పశుచికిత్సా చ (2) ఔషధాని మనుష్యోపగాని చ పశూపగాని చ యత్ర యత్ర న సన్తి సర్వత్ర హారితాని చ రోపితాని చ (3) ఏవమేవ మూలాని చ ఫలాని చ యత్ర యత్ర

న సన్తి సర్వత్ర హారితాని చ రోపితాని చ (4) మార్గేషు వృక్షా రోపితా ఉదపానాని చ ఖానితాని ప్రతిభోగాయ పశుమనుష్యాణామ్.

తెనుఁగు

రాజగు దేవానాంప్రియ ప్రియదర్శి రాజ్యమం దెల్లెడలను, అతని ప్రాంతరాజులగు చోడ, పాండ్య, సత్యపుత్ర, కేరలపుత్ర, తామ్రపర్ణి యవనరాజాంతియోకాదుల రాజ్యములందును, ఇట్లే ఆ అంతియోకుని సామంతరాజుల రాజ్యములందును, రాజగు దేవానాంప్రియ ప్రియదర్శిచే రెండువిధములవారగు చికిత్సకులు నిలువఁబడినారు. మనుష్యచికిత్సయు పశుచికిత్సయు ఏర్పాటుచేయఁబడినవి (2) మనుష్యుల కుపయోగించునవియు, పశువుల కుపయోగించునవియు అగు ఓషధులు ఎచ్చటెచ్చటలేవో అచ్చటనెల్ల అవి తీసికొనిరాఁబడి నాటింపఁబడినవి. (3) ఇట్లే వేళ్ళును పండ్లును ఎచ్చటెచ్చటలేవో అచ్చటచ్చట అవి తీసికొనిరాఁబడి నాటఁబడినవి. పశువులకును మనుష్యులకును ఉపయోగించే నిమిత్తము (4)మార్గములందు వృక్షములు నాటఁబడినవి. నూతులు త్రవ్వఁబడినవి.

---

మూడవ శిలాశాసనము: కాల్సీ

6 (1) దేవానంపియే పియదసి లాజా హేవం ఆహా

7 (2) దువాడసవసాభిసితేన మే।ఇయం ఆనపయితే (3) సవతా విజితాసి మమ యుతా లజూకే పాదేసికే పంచసు వసేసు అనుసంయానం నిఖమంతు ఏతాయే వా అతాయే ఇమాయ ధంమనుసథియా యథా అంనాయే పి కింమాయే (4) సాధు

8. మాతపితుసు సుసుసా మితసంథుతనాతిక్యానం చాబంభనసమనానం చా సాధు దానే పానానం అనాలంభే సాధు అపవియాతా అపభండతా సాధు (5) పలిసా పి చ యుతాని గననసి అనపయిసంతి హేతువతా చా వియంజనతే చా

## సంస్కృతము.

(1) దేవానాంప్రియః ప్రియదర్శీ రాజా ఏవమాహా (2) ద్వాదశవర్షాభిషిక్తేన మయా ఇద మాజ్ఞప్తా (3) సర్వత్ర విజితే మమ యుక్తా రజ్జుకాః ప్రాదేశికాశ్చ పంచసు పఞ్చసు వర్షేషు అనుసంయానం నిష్క్రామన్తు ఏతస్మై అర్థాయ అస్మై ధర్మానుశిష్ట్యై యథా అన్యస్మా అపి కర్మణే (4) సాధుః మాతాపిత్రోః శుశ్రూషా మిత్రసంస్తుతజ్ఞాతీనాం చ బ్రాహ్మణశ్రమణానాం చ, సాధుదానం ప్రాణానామనాలంభః సాధుః అల్పవ్యయతా అల్పభాణ్డతా సాధుః (5) పరిషదోఽపిచ యుక్తాన్ గణనే, ఆజ్ఞాపయిష్యన్తి హేతుతశ్చ వ్యఞ్జనతశ్చ.

## తెనుఁగు

(1) రాజగు దేవానాంప్రియప్రియదర్శి ఇట్లు చెప్పుచున్నాఁడు. (2) నా రాజ్యాభిషేకమయిన పన్నెండోసంవత్సరమున ఇది ఆజ్ఞాపింపఁబడినది. (3) నారాజ్యమునం దెల్లెడలను (రాజకీయోద్యోగులగు) యుక్తులు, లజూకులు, ప్రాదేశికులు ననువారు తమతమ మండలములందంతటను ఐదేసిసంవత్సరముల కొకసారి సంపూర్ణముగా ఈక్రింది ధర్మానుశిష్టికోసమును తక్కిన రాచకార్యములకును యాత్రచేయవలయును. (4) తల్లిదండ్రుల శుశ్రూష సాధువు. మిత్రులు, పరిచయముగలవారు, బంధువులు, బ్రాహ్మణులు, శ్రమణులు—వీరికి దానము చేయుట సాధువు. ప్రాణహింసచేయకుండుట సాధువు. అల్పవ్యయమును, అల్పసంపదను కలిగియుండుట సాధువు. (5) మహామాత్రులపరిషత్తులు తగిన కారణములను చేర్చుచు, అక్షరమైనను తప్పకుండ ఈధర్మములను గణించవలసినదిగా యుక్తులను ఉద్యోగులను ఆజ్ఞాపించవలెను.

---

## నాల్గవ శిలాశాసనము: కాల్సీ

9 (1) అతికంతం అంతలం బహూని వససతాని వధితే వా పానాలంభే విహింసా చా భుతానం నాతినా అసంపటుపతి సమనబంభనానం అసంప టిపతి (2) సే అజా దేవానంపియసా పియదసినే లాజినే ధం మచలనేనా భేలిఘోసే అహో ధంమఘోసే విమనదసనా

10 హథిని అగికంధాని అంనాని చా దివ్యాని లుపాని దసయితు జనస (3) ఆదిసా బహూహి వససతేహి నా హుతపులువే తాదిసే అజా వఢితే దేవానంపియసా పియదసినే లాజినే ధంమనుసథియే అనాలంభే పానానం అవిహింసా భూతానం నాతినం

11 సంపటిపతి బంభనసమనానం సంపటిపతి మాతాపితిసు సుసుసా (4) ఏసే చా అంనే చా బహువిధేధయచలనే వధితే (5) వధి యిసతి చేవా దేవానంపియే పియదసి లాజ ఇమం ధంమచలనం (6) పుతా చ కంనతాలే చా పనాతిక్యా చా దేవానంపియసా పియ దసినే లాజినే

12 పవఢయిసంతి చేవ ధంమచలనం ఇమం ఆవకపం ధంమసి సీలసి చా చిఠితు ధంమం అనుసాసిసంతి (7) ఏసే హి సేఠేకంమం అం ధంమానుసాసనం (8) ధంమచలనే పి చా నో హోతి అసిలసా (9) సే ఇమసా అథసా వధి అహీని చా సాధు (10) ఏతాయే అథాయే ఇయం లిఖితే

13 ఇమసా అథసా వధి యుజంతు హీని చ మా అలోచయిసు (11) దువాడసవశాభిసితేనా దేవానంపియేనా పియదశినా లాజినా లేఖితా

### సంస్కృతము.

1. అతిక్రాంతమన్తరం బహూని వర్షశతాని వర్ధిత ఏవ ప్రాణా లంభో విహింసా చ భూతానాం జ్ఞాతీనా మసంప్రతిపత్తిః శ్రమణబ్రా

హ్మణానా మసంప్రతిపత్తిః (2) త దద్య దేవానాంప్రియస్య ప్రియద ర్శినో రాజ్ఞో ధర్మచరణేన భేరీఘోషో ఽథో ధర్మఘోషో విమానదర్శ నాని, హస్తినోఽగ్నిస్కంధా అన్యానిచ దివ్యానిరూపాణి దర్శయితుం జనస్య (3) యాదృశం బహుభి ర్వర్షశతై ర్నభూతపూర్వం తాదృశ మద్య వర్ధితో దేవానాంప్రియస్య ప్రియదర్శినో రాజ్ఞో ధర్మానుశిష్ట్యా అనాలంభః ప్రాణానా మవిహింసా భూతానాం జ్ఞాతిషు సంప్రతిపత్తి ర్బ్రాహ్మణశ్రమణానాం సంప్రతిపత్తి ర్మాతాపిత్రోః శుశ్రూషా (4) ఏత చ్చాన్యచ్చ బహువిధం ధర్మచరణం వర్ధితమ్, (5) వర్ధయిష్యన్తి చైవ దేవానాంప్రియః ప్రియదర్శీ రాజేదం ధర్మచరణమ్ (6) పు త్రాశ్చ నప్తారశ్చ ప్రనప్తారశ్చ దేవానాంప్రియస్య ప్రియదర్శినో రాజ్ఞః ప్రవర్ధయిష్యన్తి చైవ ధర్మచరణ మిదం యావత్కల్పం ధర్మే శీలే చ తిష్ఠన్తో ధర్మ మనుశాసిష్యన్తి (7) ఏతద్ధి శ్రేష్ఠం కర్మ యద్ధర్మా నుశాసనం, (8) ధర్మచరణమపి న భవ త్యశీలస్య (9) త దస్యార్థస్య వృద్ధి రహాసిశ్చ సాధుః, 10). ఏతస్మై అర్థా యేదం లిఖితమ్, అస్యా ర్థస్య వృద్ధిం యుఞ్జన్తు హానిం చ మా ఆలోచయన్తు (11) ద్వాదశవ ర్షాభిషిక్తేన దేవానాంప్రియేణ ప్రియదర్శినా రాజ్ఞా లేఖితమ్.

తెనుఁగు.

1. పూర్వకాలమం దనేకసంవత్సరములవరకును ప్రాణులను చంపుటయును, భూతములనుహింసించుటయును, జ్ఞాతులయెడ అనురా దయు, శ్రమణులయెడలను బ్రాహ్మణులయెడలను తిరస్కారభావమును వృద్ధిపొందించఁబడియుండెను.

(2) కాని, యిప్పుడు దేవానాంప్రియప్రియదర్శి ధర్మాచరణ మువల్ల, విమానములనుచూపించుట, ఏనుఁగులు, అగ్నిస్కంధములు, ఇత రదివ్యవిగ్రహములు, వీనినిప్రదర్శించుట (ఆసమయములందు) ధర్మఘో షము భేరీఘోషమువలెనమున చేయఁబడుచున్నది.

2. లోకస హితసుఖాయే సే తం అపహాట ౦ తం ధంమవఢీ పాపోవ (3) హేవం లోకస

3. హితసుఖే తి పటివేఖామి అథా ఇయం నాతిసు హేవం పత్యా సంనేసు హేవం అపకతేసు

4. కింమం కాని సుఖం ఆవహామిా తి తథా చ విదహామి (4) హేమేవ సవనికా-యేసు పటివేఖామి

5. [5] సవపాసండా పి మే పూజిత వివిధాయ పూజాయ (6) ఏ చు ఇయం అతన పచూపగమనే

6. సే మే మోఖ్యము తే (7) సడువీసతివసాభిసితేన మే ఇయం ధంమలిపి లిఖాపిత

సంస్కృతము, తెనుఁగు.

చూ. అశోకస్తంభ శాసనము _ ఢిల్లీ - తోపాౕ.

—o—



# రాంపూర్వ స్తంభము



ఈస్తంభము ఉత్తరబీహారునందలి చంపారనుజిల్లాలోని రాంపూర్వా అనుగ్రామమునన్నది. ఈస్తంభముక్రిందిభాగమున నొక సింహవిగ్రహమున్నది. దీనిపైని అశోకుని మొదటి ఆఱుశాసనములును లిఖింపబడియున్నవి. ఈస్తంభము నేలపైపడియుండి కొంతభాగము నీటిలోనున్నది. సింహవిగ్రహముయొక్క మీందిభాగము పోయినది. కాని, ఘంటాకారముగనున్న పైభాగమును దానిపైనున్న హంసలు, పువ్వులు మొదలైన విగ్రహములును బాగుగనేయున్నవి. సింహవిగ్రహమును సర్ జాన్ మార్షల్ గారు కనుగొనియున్నారు. ఈస్తంభము 44 అడుగుల $9\frac{1}{2}$ అంగుళములు పొడవుగనున్నది. అందులో 8 అడుగుల 9 అంగుళములభాగము గరుకుగను తక్కినభాగము నునుపుగను నున్నది. ఈస్తంభము నిప్పుడు మునుపటిస్థలమునుండి రెండువందలగజములు తీసికొనివచ్చి అదిచెడిపోకుండ దానిపైని ఒకఇంటిని కట్టియున్నారు.

మొదటిస్తంభశాసనము: రాంపూర్వ

(1) స్తంభము ఉత్తరముఖము.

1. [1] దేవానంపియే పియదసి లాజ యేవ ఆహా [2]సడువీసతివసాభిసితేన మే ఇయం ధంమలిపి లిఖాపిత [3]హిదతపాలతే
2. దుసంపటుపాదయే అంనత అగాయ ధంమకామతాయ అగాయ తలిఖాయ అగాయ సుసూసాయ అగేన భయేన అగేన ఉసాహేన
3. (4) ఏస చు ఖో మమ అనుసథియా ధంమాపేఖా ధంమకామతా చ సువే సువే వఢిత వఢీసతి చేవ (5) పులిసా పి మే ఉకసా చ

4. సేవయా చ మఖియా చ అనువిధీయంతి సంపటిపాదయంతి చ అలం చపలం సమాదపయిదవే (హేమేవ) అంతమహామాతా పి (7) ఏసా హి విధి

5. యా ఇయం ధంమేన పాలన ధంమేన విధానే ధంమేన సుఖీయన ధంమేన గోతీ తి

సంస్కృతము, తెనుఁగు. చూ. మొదటి స్తంభశాసనము- ఢిల్లీ-తోపా్రి.

---

రెండో స్తంభశాసనము : రాంపూర్వ

---

1. (1) దేవానంపియే పియదసి లాజ హేవం ఆహా (2) ధంమే సాధు కియం చు ధంమే (3) అపాసినవే బహు కయానే దయ దానే సచే సోచేయే తి (4) చఖుదానే పి మే

2. బహువిధే దింనే [5] దుపదచతుపదేసు పఖివాలిచలేసు వివిధే మే అనుగహే కటే ఆ పానదఖినాయే [6] అంనాని పి చ మే బహూని కయానాని కటాని

3. (7) ఏతాయే మే అఠాయే ఇయం ధంమలిపి లిఖాపిత హేవం అనుపటిపజంతు చిలంథితీకా చ హోహాతూ తి (8) యే చ హేవం సంపటిపజిసతి సే సుకటం కఛతీ తీ

సంస్కృతము, తెనుఁగు. చూ. రెండో స్తంభశాసనము- ఢిల్లీ-తోపా్రి.

---

మూడో స్తంభశాసనము : రాంపూర్వ

---

1. (1) దేవానంపియే పియదసి లాజ హేవం ఆహా (2) కయానంమేవ దేఖంతి ఇయం మే కయానే కటే తి (3) నో మిన పాపం దేఖంతి ఇయం మే కటే తి

2. ఇయం వ ఆసినవే నామా తి (4) దుపటివేఖే చు ఖో ఏస (5) యేవం చుఖో ఏస దేఖియే (6) ఇమాని ఆసినవగామీని నా మా తి అథ చండియే నిఠూలియే

3. కోధే మానే ఇస్యా కాలనేన వ హకం మా పలిభసయిసం (7) ఏస బాఢం దేఖియే (8) ఇయం మే హిదతికాయే ఇయం మన మే పాలతికాయే తి

సంస్కృతము, తెనుగు. చూ. మూడో స్తంభ శాసనము_ఢిల్లీ-తోపా).

## నాలుగో స్తంభ శాసనము : రాంపూర్వా.

1. (1) దేవానంపియే పియదసి లాజ హేవం ఆహా (2) సడువీసతివసాభిసితేన మే ఇయం ధంమలిపి లిఖాపిత (3) లజూకా మే బహూసు పానసతసహసేసు

2. జనసి ఆయుత (4) తేసం యే అభిహాలే వ దండే వ అతపతియే మే కటే కింతి లజూక అస్వథ అభీత కంమాని పవతయేవూ తి జనస జానపదస

3. హితసుఖం ఉపదహేవు అనుగహినేవు చ (5) సుఖీయనదుఖీయనం జానిసంతి ధంమయుతేన చ వియోవదిసంతి జనం జానపదం కింతి హిదతం చ పాలతం చ

4 అలాధయేవూ తి (6) లజూకా పి లఘంతి పటిచలితవే మం (7) పులిసాని పి మే ఛందనాని పటిచలిసంతి (8) తే పి చ కాని వియోవదిసంతి యేన మం లజూక

5. చఘంతి ఆలాధయితవే (9) అధా హి పకం వియతాయే ధాతియే నిసిజితు అస్వథే హోతి వియత ధాతి చఘతి మే పజం సుఖం పలిహటవే తి హేవం మమ లజూక కట

6. జానపదస హితసుఖాయే (10) యేన ఏతే అభీత అస్వథా సతం అవిమన కంమాని పవతయేవూ తి ఏతేన మే లజూకా నాం అభిహాలే వ దండే వ అతపతియే కటే

7. (11)ఇఛితవియే హి ఏస కింతి వియోహాలసమతా చ సియ దండస మతా చ (12) ఆ లా ఇతే చ పి మే ఆవుతి బంధనబధానం మునిసానం తీలితదండానం పతవధానం

8. తింని దివసాని మే యోతే దింనే (13) నాతికా వ కాని నిఝపయిసంతి జీవితాయే తానం నాసంతం వ నిఝపయితవే దానం దాహంతి పాలతికం ఉపవాసం వ కఛంతి

9. [14]ఇఛా హి మే హేవం నిలుధసి పి కాలసి పాలతం ఆలాధయే వూ తి (15) జనస చ వఢతి వివిధే ధంమచలనే సయమే దానసవిభాగే తి

సంస్కృతము, తెనుఁగు.చూ. నాలుగో స్తంభశాసనము-ఢిల్లీ - తోపాఘ్.

---

అయిదో స్తంభశాసనము : రా. పూర్వ

---

[2] స్తంభదక్షిణముఖము.

1. [1] దేవానంపియే పియదసి లాజ హేవం ఆహా [2] సడువీసతివసాభిసితేన మే ఇమాని పి జాతాని అవధ్యాని కటాని సే యథ

2. సుకే సాలిక అలునే చకవాకే హంసే నందీముఖే గేలాటే జతూక అంబా - కపిలిక దుళి అనఠికమఛే వేదవేయకే గంగాపుపుటకే ద

3. గంగాపుపుటకే సంకుజమఛే కఫటసేయకే పంనసనే సిమలే సం
డకే ఓకపిండే పలనతే సేతకపోతే

4. గామకపోతే సవే చతుపదే యే పటిభోగం నో ఏతి వ చ
ఖాదియతి [3] అజకా నాని ఏళకా చ సూకలీ చ గభినీ వ

5. పాయమీనా వ అవధ్యపోతకే చ కాని ఆసంమాసికే [4] వధి
కుకుటే నో కటవియే (5) తుసే సజీవే నో ఝాపయితవియే

6. [6] దావే అనఠాయే వ విహిసాయే వ నో ఝాపయితవియే [7]
జీవేన : జీవే నో పుసితవియే [8] తీసు చాతుంమాసీసు తిస్యం
పుంనమాసియం

7. తింని దివసాని చావుదసం పంనడసం పటిపదం ధువాయే చ
అనుపోసథం మఛే అవధ్యె నో పి వికేతవియే [9] ఏతాని
యేవ

8. దివసాని నాగవనసి కేవటభోగసి యాని అంనాని పి జీవనికా
యాని నో హంతవియాని [10] అఠమిపఖాయే చావుదసాయే

9. పంనథసాయే తిసాయే పునావసునే తీసు చాతుంమాసీసు సుది
వసాయే గోనే నో నిలఖితవియే అజకే ఏళకే సూకలే

10. ఏ వా పి అంనే నీలఖియతి నో నీలఖితవియే [11] తిసాయే
పునావసునే చాతుంమాసియే చాతుంమాసిపఖాయే అస్వస
గోనస

11. లఖనే నో కటవియే [12] యావ సడువీసతివసాభిసితేన మే
ఏతాయే అంతలికాయే పంనవీసతి బంధనమోఖాని కటాని

సంస్కృతము, తెనుఁగు.చూ. అయిదో స్తంభశాసనము-ఢిల్లీ-తోపా.

---

## ఆరోస్తంభశాసనము : రాంపూర్వ

---

1. దేవానంపియే పియదసి లాజ హేవం ఆహా [2] దువాడసవసాభిసి తేన మె ధంమలిపి లిఖాపిత లోకస హితసుఖాయే సే తం అపహాట

2. తం తం ధంమవఢి పాపోవ (3) హేవం లోకస హితసుఖే తి పటివేఖామి అథ ఇయం నాతిసు హేవం పత్యాసంనేసు హేవం అపకఠేసు కింమం కాని

3. సుఖం ఆవహామీ తి తథా చ విదహామి [4] హేమేవ సవని కాయేసు పటివేఖామి [5] సవపాసండా పి మే పూజిత వివిధా-య పూజాయ [6] ఏ చు ఇయం

4. అతన పచూపగమనే సే మే మోఖ్యముతే [7] సడువీసతివ సాభిసితేన మే ఇయం ధంమలిపి లిఖాపిత

సంస్కృతము, తెనుఁగు.చూ. ఆరోస్తంభశాసనము - ఢిల్లీ - తోపాౘి



# అలహాబాదు—కోసముస్తంభము.



ఈ స్తంభమిప్పుడు అలహాబాదుకోటలోనున్నది. ఇది 42 అడుగుల 7 అంగుళముల ఎత్తుగనున్నది. దీనిపైని (1)ఢిల్లీశోపాస్తంభ ము విూఁది అశోకుని ఆఱుశాసనములును(2) రాణీశాసనమును (3) కౌశాంబీ శాసనమునేగాక మహారాజాధిరాజసముద్రగుప్తునిశాసన మొకటియు, జహాంగీర్ చక్రవర్తి శాసనమొకటియు, ఈశాసనపంక్తులమధ్యనుండి నాగ రాక్షరములలో వ్రాయఁబడిన మరియొకశాసనమును గలవు. ఈ స్తంభమువిూఁది యశోకుని శాసనములను చదివినవాఁడు ప్రిన్సెపుపండితుఁడు. రాణీశాసనముకూడప్రిన్సెపుపండితుఁడె చదివినాఁడు. కౌశాంబీ శాసనమును కన్నింగుహాముపండితుఁడు మొట్టమొదటచదివినాఁడు.

ఈ స్తంభమును అశోకచక్రవర్తి మొట్టమొదట కౌశాంబీపురము నందు నిలిపియుండవలయును. ఈపురము నేఁడు అలహాబాదునకు 28 మైళ్ళదూరమున యమునానదికి యెడమయొడ్డుననున్న కోసముఅను గ్రామమే. అచ్చటనుండి ఫిరోజుషహాయైనను, అక్బరుచక్రవర్తియైనను దానిని అలహాబాదునకు తెప్పించియుండును. సముద్రగుప్తునిశాసనము ఈ స్తంభముపై చెక్కఁబడునప్పటి కది కోసమందెయుండియుండును. దీనిపైనున్న జహాంగీరువ్రాయించినశాసనము క్రీ. శ. 1605 వ సం॥రం నాఁటిది. దీనిపై నాచక్రవర్తి తనపూర్వులపేర్లను లిఖించెను.

(1) మొదటి ఆరు స్తంభశాసనములు

మొదటి స్తంభశాసనము; అలహాబాదు—కోసము.

1 (1) దేవానంపియే పియదసి లాజా హేవం ఆహా (2) సడువీసతివ
సాభిసితేనమే ఇయం ధంమలిపి లిఖాపితా (3) హిదతపాలతే
దుసంపటిపాదయే

వసాభిసితేన మే ఇమాని జాతాని అవధియాని కటాని సే యథ సుకే సాలికా అలునే చకవాకే

2 ...నందీముఖే గేలాటే జతూకా అంబాకిపిలికా దుడీ అనఠికమచ్ఛే వేదవేయకే గంగాపుపుటకే సంకుజమచ్ఛే కఫట...కే పంనససే సిమలే సండ.

3 .........తకపోతే గామకపోతే సవే చతుపదే యే పటిభోగం నో..........నా.........పయామీ...

4 ......సజీవే నో ఝాపయితవియే......

5 ......ని చావు దసం పంచద.........

6 ...ని... ...

7 ... ...

8 లఖనే నో కటవియే (12) యా...

---

సంస్కృతము, తెనుఁగు. చూ. అయిదో స్తంభశాసనము-ఢిల్లీ-తో పా౧.

ఆరో స్తంభశాసనము: అలహాబాదు-కోసము.

---

1 [1] ...పియే పియదసీ వా...తం......ఢి పా...

[3] హేవం లోకస

2 హితసుఖే తి పటివేఖామి అథ ఇయం......వం పత్యాసంనేసు హేవం అపకతేసు కిమం కాని.........విదహామి [4] హేవం మేవ సవ...కాయేసు పటివేఖామి

3 [5] సవపాసండా పి మే పూజితా వివిధాయ పూజాయా [6] ఏ చు ఇయం అతనా పచుపగమనే సే మే ముఖ్యముతే [7] ... లిపీ లిఖాపితా తి

సంస్కృతము, తెనుఁగు. చూ. ఆరో స్తంభశాసనము-ఢిల్లీ-తో పా౧.

(2) రాణీస్తంభశాసనము ; అలహాబాదు - కోసము.

1. (1) దేవానాంపియసా వచనేనా సవత మహామతా
2. వతవియా (2) ఏ హేతా దుతియాయే దేవియే దానే
3. అంబావడికా వా ఆలమే వ దానగహే వ ఏ వా పి అంనే
4. కీఛిగనీయతి తాయే దేవియే షే నాని (3) హేవం ...న...
5. దుతీయాయే దేవియే తి తీవలమాతు కాలువాకియె

సంస్కృతము.

(1) దేవానాంప్రియస్య వచనేన సర్వత్ర మహామాత్రా వక్తవ్యాః (2) యదత్ర ద్వితీయస్యా దేవ్యా దానమామ్రవటికా వా ఆరామో వా దానగృహం వా యద్వా ప్యన్య ద్గణ్యతే తస్యా దేవ్యా స్త జ్ఞాతవ్యమ్ (3) ఏవం...ద్వితీయస్యా దేవ్యా ఇతి తీవరమాతుః కారువాక్యాః

తెనుఁగు.

(1) దేవానాం ప్రియునివచనముగా అన్ని స్థలములయందలి మహామాత్రులును నిట్లుచెప్పఁబడవలయును. మామిడితోటలుగాని, ఇతరఆరామములుగాని, దానగృహములుగాని ఏవేవి రెండవరాణి దానములుగా నొసంగినదో యవియన్నియు నారాణీపేరనే గణింపఁబడవలయును. (3) కారులాకియొక్క తల్లియగు తీవర యనురెండవరాణి ఇట్లు కోరుచున్నది.

[3] కౌసాంబీ స్తంభశాసనము : అలహాబాదు - కోసము.

1. [1] దేవానంపియే ఆనపయతి (2) కోసంబియం మహామాత
2. .........సమగే కటే [4] సంఘసి నో లహియే
3. ............సంఘం భాఖతి భిఖు వా భిఖుని వా సే పి చా
4. ఓదాతాని దుసాని సనంధాపయితు అనావాససి ఆవాసయియే

సంస్కృతము.

(1) దేవానాంప్రియః ఆజ్ఞాపయతి [2] కౌసాంబ్యాం మహామాత్రా ......సమగ్రం కృతమ్ [4] సంఘస్య న లభ్యతే...సంఘం భనక్తి భిక్షుకో వా భిక్షుణీ వా తేఽపి చావదాతాని దూష్యాణి సన్నిధాప్య నావాస మావా సయితవ్యః.

తెనుఁగు.

(1) దేవానాంప్రియుఁ డాజ్ఞాపించుచున్నాఁడు. [2] కౌసాంబి యందలి మహామాత్రులు...సంపూర్ణము చేయఁబడినది. (4) సంఘమునకు పొందఁడు, ...... భిక్షుకుఁడుగాని, భిక్షుణిగాని సంఘమును విడఁదీసినయెడల వారికి దూష్యములైన తెల్లనిబట్టలను కట్టి, మఱియొక స్థలమునకు పంపి వేయవలయును.



# సాంచీస్తంభము



సాంచీగ్రామము మధ్యయిండియాలోని భూపాల్ సంస్థానమునందు భీల్సాకు 5½ మైళ్ళదూరములోను, సాంచీరైల్వేస్టేషనుకు ముప్పావుమైలుదూరములోను నున్నది. ఈఅశోకునిస్తంభము పూర్వము మిక్కిలిపొడువుగానుండిన పెద్దస్తంభములోని యొకఖండమైయున్నది. ఈస్తంభముయొక్కపైభాగమున నాలుగు సింహముల విగ్రహములు చెక్కఁబడియున్నవి. ఈశాసనములోని మొదటిభాగము పోయినది. మిగిలినదానిలోని మొదటిపంక్తి చాలాచెడియున్నది.



# చిన్న స్తంభ శాసనములు

## సాంచీస్తంభము

1. ..........
2. ...యా భేత... (3) ...ఘే......మగే కటే
3. భిఖూనం చ భిఖుసీనం చా తి పుతప-
4. పోతికే చందమసూరియికే [4] యే సంఘం
5. భాఖతి భిఖు వా భిఖుని వా ఓదాతా-
6. ని దుసాని సనంధాపయితు ఆనావా-
7. సని వాసాపేతవియే [5] ఇఛా హి మే కిం-
8. తి సంఘే సమగే చిలథితీకే సియా తి

## సంస్కృతము

......యా భక్త(వ్యః) [3]...ఘః...(స)మగ్రం కృతమ్. భిక్షుకానాం చ భిక్షుణీనాం చేతి పుత్రప్రపౌత్రికం చంద్రమసూర్యకమ్ [4] యో సంఘం భనక్తి భిక్షుర్వా భిక్షుణీవా అవదాతాని దూష్యాణి సన్నిధా ప్యానావాస మావాసయితవ్యః [5] ఇచ్ఛామ్యహం కిమితి సంఘో సమగ్రో చిరస్థితికా అస్త్వితి.

## తెనుఁగు.

......విడఁదీయఁబడఁగూడదు (3) భిక్షుకులయు, భిక్షుణులయు సంఘము...(నా)పుత్రప్రపౌత్రులున్నంతకాలమును, చంద్రసూర్యు లున్నంత కాలమును సమగ్రము చేయఁబడినది. (4) భిక్షువుగాని, భిక్షుణిగాని సంఘమును విడఁదీసినయెడల దూష్యములగు తెల్లనిబట్టలనుకట్టి మఱి యొక స్థలమునకు పంపివేయవలెను. (5) సంఘముసమగ్రముగను, చిర స్థితికముగను నుండుగాక యని కోరుచున్నాను.

---

# సార్నాథస్తంభము.

సార్నాథగ్రామము కాశీకి మూఁడునర్నమైళ్ళదూరముననున్నది. ఇది మిగదాయమను లేళ్ళవనమునకు దగ్గరగా ఋషిపట్టణమునకు చేరువగనున్నది. ఈమిగదాయమునందే బుద్ధుఁడు తనమొదటిధర్మోపన్యాసమును చేసెను. ఈ స్తంభము పైభాగమున మిక్కిలిఅద్భుతముగాచెక్కఁబడిన నాలుగుసింహములు అమర్పఁబడియున్నవి. ఈనాలుగుసింహములమధ్యను పెద్దశిలాచక్రమున్నది. ఇప్పుడాచక్రములోని కొన్నిఖండములుమాత్రము మిగిలియున్నవి. ఇదియేధర్మచక్రము. ఈసింహవిగ్రహములు ఒకమద్దెలఆకారముగలరాతిపై నిలువఁబడియున్నవి. మద్దెలపైని ఒకసింహము, ఒకఏనుఁగు, ఒకఎద్దు, ఒకగుఱ్ఱము, వీనివిగ్రహములు నాల్గుచక్రములమధ్య అమర్పఁబడియున్నవి. "ఏదేశమునందుగాని ఇంత కళానిపుణతతోను ఇంతకంటెఅందముగను, ఇంతకంటెస్వాభావికముగను, గంభీరముగను ప్రతివిషయములోను తూచాతప్పకుండ చెక్కఁబడిన జంతుశిల్పము కానరాదు" అని యొకవిద్వాంసుఁడగు చిత్రకారుఁడువ్రాయుచున్నాఁడు.

ఈమృగవనమునకు అశోకరాజుకట్టిన యొకస్థూపమునకుముందు 70 అడుగులయెత్తుగల యొకశిలాస్తంభముండెనని హూనుత్సాంగుఅను చీనాయాత్రికుఁడువ్రాసియున్నాఁడు. కాని ప్రస్తుతస్తంభము 37 అడుగులు మాత్రమేయున్నది. హూనుత్సాంగు దీనియెత్తునుఎక్కువగచెప్పినాఁడో, ఇది మఱియొకస్తంభమో తెలియదు.

1. (1) దేవా......

2. ఏ ల.....

3. పాట......యే కేనపి సంక్షో భేతవే (4) ఏ చుం ఖో

4. భి వా భిఖుని వా సంఘం భాఖతి సే ఓదాతాని దుసాని సం సంధాపయియా ఆనావాససి

5. ఆవాసయియే (5) హేవం ఇయం సాసనే భిఖుసంఘసి చ భిఖుని-సంఘసి చ వింనవయితవియే

6. (6) హేవం దేవానంపియే ఆహా (7) హేదిసా చ ఇకా లిపీ తుఫాకంతికం హువాతి సంసలనసి నిఖితా

7. ఇకం చ లిపిం హేదినమేవ ఉపాసకానంతికం నిఖపాథ (8) తే పి చ ఉపాసకా అనుపోసథం యావు

8. ఏతమేవ సాసనం విస్వంసయితవే అనుపోసథం చంధువాయే ఇకి కేమహామాతే పోసథా యే

9. యాతి ఏతమేవ సాసనం విస్వంసయితవే ఆజానితవే చ (9) ఆవ తే చ తుఫాకం ఆహాలే

10. సవత వివాసయాథ తుఫే ఏతేన వియంజనేన (10) హేమేవ సవేసు కోటవిషవేసు ఏతేన

11. వియంజనేన వివాసాపయాథా

సంస్కృతము.

(1) దేవానంపిృయః పిృయదర్శీ రాజా (2) ఆహా (3) పాట (లిపుత్రే) తథా బాహ్యేషు న) గరేషు చ కేనాపి సంఘో భక్తవ్యః (4) యస్తు ఖలు భిక్షుకో వా భిక్షుకీవా సంఘంభన క్తి సోవదాతాని దూష్యాణి సన్నిధా ప్యాత్మవాన మావాసయి తవ్యః (5) ఏవమిదం శాసనం భిక్షుకసంఘే చ భిక్షుకీసంఘే చ విజ్ఞాపయితవ్యమ్ (6) ఏవం దేవానాంపిృయ ఆహా (7) ఈదృశీ చైకా లిపిర్యుష్మ దన్తికే భవత్వితి సంసరణే నిక్షిప్తా, ఏకాం చ లిపి మీాదృశీ మే వోపాసకాన్తికే నిక్షిపత (8) తేఽపి చోపాసకా అనుపోషథం యాంతు ఏతదేవ శాసనం విశా

నయితుమ్, అనుపోషధం చ ధ్రువాయా మేకో మహామాత్యః పోషధాయ యాతి ఏతదేవ శాసనం విశ్వాసయితు మాజ్ఞాపయితుం చ (9) యావచ్ఛ యుష్మాక మాహారః సర్వత్ర వివాసయత యూయ మేతేన వ్యఞ్జనేన (10) ఏవమేవ సర్వేషు కోట్టవిషయేష్వేతేన వ్యఞ్జనేన వివాసయత.

తెనుగు.

(1) దేవానంప్రియుఁడగు ప్రియదర్శిరాజు (2) చెప్పుచున్నాఁడు. (3) పాటలీపుత్రమునందుగాని, (దానికి బాహ్యముగానున్న ఇతర నగరములందుగాని, యెవఁడును సంఘమును విడఁదీయఁగూడదు. (4) భిక్షుకుఁడుగాని, భిక్షుకికిగాని, యెవ్వరైనను సంఘమును విడఁదీసిన యెడల వారికి తెల్లనిబట్టలనుకట్టించి వేరేయొకచోట వాసముచేయునట్లు చేయవలయును. (5) ఈయనుశాసనమును భిక్షుకులసంఘమునకును, భిక్షుకీసంఘమునకును తెలియఁజేయవలయును. (6) దేవానాంప్రియుడిట్లు పలుకుచున్నాఁడు. (7) ఈయనుశాసనముయొక్క ప్రతిని నీకార్యాలయమందును, మఱియొకప్రతిని ఉపాసకుల గృహమునందును ఉంచవలయును. (8) ఈఉపాసకులీయనుశాసనమునందు విశ్వాసము కలిగియుండుటకు ఉపవాసదినములందెల్లను నొకచోట కూడవలెను. ఈయనుశాసనమునందు విశ్వాసముగల్గి దానిని బోధపఱచుకొనుట కుపవాసదినములందెల్ల మహామాత్రులుగూడ నచటికి తప్పకపోవుచుండవలెను. (9) మీరాష్ట్ర మెంతవఱకున్నదో యంతవఱకు నొకఉద్యోగస్థుని ఈధర్మానుశాసన ప్రకారము మీరు పంపుచుండవలయును. (10) అట్లే నీకిందియుద్యోగస్థులుకూడ ప్రాంతదుర్గప్రదేశములయందీధర్మానుశాసనమును వినిపించుటకు వారికిందియుద్యోగస్థులను పంపుచుండవలెను.

———o———

# రుమ్మిందై స్తంభము



ఈ స్తంభము నేపాల్‌దేశములో భగవాన్‌పూర్ నకు రెండు మైళ్ళుత్తరముగను బస్తీయను బ్రిటిషుజిల్లాలోని దుళ్ళాగ్రామమునకు ఆగ్నేయముగ 5 మైళ్ళదూరముగను నున్న రుమ్మిందై దేవాలయము నకు దగ్గరనున్నది. దీనియెత్తు 21 అడుగులు. ఈస్థలమునందు బుద్ధశాక్యముని పుట్టుటచేత అశోకచక్రవర్తి ఈస్థలమునకువచ్చి ఈ స్తంభమును నిలిపి లుంబినీగ్రామమునిూఁది పన్నుల నన్నిటిని తీసివైచెనని ఈశాసనము తెలుపుచున్నది. ఈరుమ్మిందై అనుస్థలమే శాసనములోని లుంమ్మినీగ్రామమును, బౌద్ధగాధలలోని లుంబినీవనమునై యున్నది.

1. (1) దేవానపియేన పియదసిన లాజిన వీసతివసాభిసితేన
2. అతన ఆగాచ మహీయితే హిద బుధే జాతే సక్యమునీ తి
3. (2) సిలా విగడభీ చా కాలాపిత సిలాథభే చ ఉసపాపితే
4. హిద భగవం జాతే తి (3) లుమ్మినిగామే ఉబలికే కటే
5. అఠభాగియే చ

సంస్కృతము.

1. దేవానాంప్రియేణ ప్రియదర్శినా రాజ్ఞా వింశతివర్షాభిషిక్తే నా-
త్మనాగత్య మహీయితమత్ర బుద్ధో జాతః శాక్యమునిరితి [2]
శిలావలభీ చ కారితా శిలా స్తమ్భ శ్చోత్థాపితోఽత్ర భగవా
ఞ్జాత ఇతి [3] లుంబినీ గ్రామ ఉద్వలికః కృతోఽష్టభాగీ చ.

తెనుఁగు

[1] బుద్ధశాక్యముని ఇచ్చటజన్మించినందున దేవానాంప్రియప్రియదర్శిరాజు తనరాజ్యాభిషేకకాలము ఇరువదియవసంవత్సరమున నిచటికి స్వయముగవచ్చి దీనినిపూజించెను. [2] భగవంతుఁడగుబుద్ధుఁడిచ్చ

టజన్మించెనని తెలుపుటకు ఇచటనొకశిలపై నొకగుఱ్ఱముయొక్క శిలా విగ్రహమునునిలిపి యొకశిలాస్తంభమును స్థాపించెను. లుంబినీగ్రామము వారు పన్నులను చెల్లింపనక్కఱలేకుండఁగను, ఊరిఫలసాయములో ఎనిమిదవభాగముమాత్రము చెల్లించునట్లును అతఁడు కట్టడిచేసెను.

---

# నిగలీసాగరస్తంభము

---

ఈ స్తంభము రుమ్మిందై స్తంభమునకు 13 మైళ్ళదూరముననున్న నిగ్లీవపట్టణమున కొకమైలుదక్షిణముగనున్న నిగలీసాగరమను పెద్దచెఱువుకు పడమటియొద్దుననున్నది. ఈ స్తంభమునుగూర్చిహావుయుత్సాంగు తెలిపియున్నాఁడు.

1. [1] దేవానంపియేన పియదసిన లాజిన చోదసవసాభిసితేన
2. బుధస కోనాకమనస థుబే దుతియం వఢితే
3. [2]......సాభిసితేన చ అతన ఆగాచ మహీయితే
4. ......పాపితే

సంస్కృతము.

1. దేవానాంప్రియేణ ప్రియదర్శినా రాజ్ఞా చతుర్దశవర్షాభిషిక్తేన బుద్ధస్య కనకమునే స్తూపో ద్వితీయం వర్ధితః [2] [వింశతివ] ర్షాభిషిక్తేన చాత్మనాగత్య మహీయితం [స్తంభ శో చ] స్థాపితః

తెనుఁగు

[1] దేవానాంప్రియప్రియదర్శిరాజు తనరాజ్యాభిషేకకాలము పదునాలుగవసంవత్సరమున కనకమునిబుద్ధునిస్తూపమును పూర్వముఁదానికంటె రెండింతలుగ విస్తరింపఁజేసెను. [2] తనరాజ్యాభిషేకకాలము ఇరువదవయేఁట నీస్థలమునకు స్వయముగావచ్చి, దానినిపూజించి, యొకశిలాస్తంభమునునిలిపెను.

# నాలుగో భాగము: చిన్న శిలాశాసనములు

## రూపనాథశిల



రూపనాథగ్రామము మధ్యవరగరాలలోనున్నది. ఇది జబ్బల్‌పూరుజిల్లా, కాట్నీకిని మధ్యమున్న స్లీమనాబాదు రైలుస్టేషనునకు పడమరగ 14 మైళ్ళదూరమునవున్నది. ఇదిరొకయాత్రాస్థలము.

### 1. రూపనాథ శిలాశాసనము

1. (1) దేవానంపియే హేవం ఆహా (2) సాతిరకేకాని అఢతియాని వయం సుమి ప్రకాస సకే (3) నో చు బాఢి పకతే (4) సాతిలోకే చు ఛవఛరే యం సుమి హకం సఘ ఉపేతే

2. బాఢి చ పకతే [5] యా ఇమాయ కాలాయ జంబుదిపసి అమిసా దేవా హుసు తే దాని మిసా కటా [6] పకమసిహి ఏస ఫలే [7] నో చ ఏసా మహతతా పాపోతవే ఖుదకేన

3. పి పకమమినేనా సకియే పిపులే పా స్వగే ఆరోధేవే [8] ఏతియ అఠాయ చ సావనే కటే ఖుదకా చ ఉడాలా చ పకమతు తి అతా పి చ జానంతు ఇయ పకరా వ

4. కితి చిరఠితికే సియా [9] ఇయం హి అఠే వఢి వఢిసితి విపుల చ వఢిసిత అపలధియేనా దియఢియ వఢిసత [10] ఇయ చ అఠే పవతిసు లేఖాపేత వాలత [11] హధ చ అధి

5. సాలాఠభే సిలాఠంభసి లాఖాపేతవయ త [12] ఏతినా చ వయ జనేనా యావతక తుపక అహాలే సవర వివసేతవాయ తి [13] వ్యుథేనా సావనే కటే [14] ౨౦౦ ౫౦ ౬ స-

6. త వివాసా త

సంస్కృతము.

1. దేవానాంప్రియః ఏవమాహా [2] సాతిరేకాని అర్ధతృతీయాని వయోఽస్మిపరికాశంశాక్యః [3] న చ బాఢం ప్రక్రాంతః [4] సాతిరేకే చ సంవత్సరే యోఽస్మి అహం సంఘముపేతో బాఢం చ ప్రక్రాంతః [5] ఏతస్మిన్ కాలే జంబూద్వీపే అమిశ్రా దేవాః భవంతి తే ఇదానీం మిశ్రాః కృతాః [6] పరాక్రమస్య హి ఏతత్ ఫలం [7] న చ ఏతత్తు మహాతః ప్రాప్తవ్యం క్షుద్రేణాపి పరాక్రమేణ శక్యం విపులమపి స్వర్గ మారాధితవ్యమ్ [8] ఏతస్మై అర్థాయ చ శ్రావణం కృతం క్షుద్రాశ్చ ఉద్ధతాశ్చ ప్రక్రామంత్వితి. అంతకాఅపి జానంతు ఇదం పరాక్రమం వా కిమితి చిరస్థితికమస్తు. [9] అయం హి అర్థో వృద్ధిం వర్ధయిష్యతే విపులం చ వర్ధయిష్యతే అపరా ద్ధేన ద్వ్యర్ధం ర్ధయిష్యతే. [10] అయం చార్థం ప్రవర్తయిష్యతే. లేఖా పయిష్యత్యర్థం హావేలతః [11] అథ చ సంతి శిలాస్తంభాః శిలాస్తంభేషు లేఖాపితవ్యం [12] ఏతేన చ వ్యంజనేన యావతో యుష్మాకం ఆహారః సర్వం వివాసయితవ్యమితి. [13] వ్యుష్టేటన శ్రావణం కృతం [14] ౨౦౦ ౫౦ ౬ శతవివాసాతః.

తెనుఁగు.

(1) దేవానాంప్రియుఁ డిట్లుచెప్పుచున్నాఁడు. (2) నేను ప్రకాశముగా శాక్యుఁడనై రెండున్నరసంవత్సరములు పైగా కావచ్చినది. (3) కాని నేను మిక్కిలి యుత్సాహమును జూపియుండలేదు. (4)అయినను ఒక సంవత్సరమునకు పైఁగా నేను సంఘమును దర్శించినది మొదలు మిక్కిలి యుత్సాహవంతుఁడనై యున్నాను. (5) ఆకాలమున జంబూద్వీపమునందు జనులతోఁ కలసియుండని దేవతలను నేను జనులతోఁ కలిపితిని. (6) ఇదియే యుత్సాహమునకు ఫలము. ఇది గొప్పవా

చేతనే పొందఁదగినది కాదు. (7) క్షుద్రుఁడైనను ఉత్సాహవంతుఁడైనచో గొప్పస్వర్గమును పొందఁగలడు.[8]బీదవారునుగొప్పవారునుకూడ నుత్సాహవంతులగుదురనియు, నాప్రాంతవాసులును దానిని తెలిసికొందురనియు, ఈయుత్సాహము చిరస్థాయిగ నుండననియు నీధర్మశ్రావణము చేయబడినది. [9]ఈఅర్థమును నేనువర్ధిల్లచేసెదను; ఎక్కువగా వర్ధిల్లఁ జేసెదను. ఇప్పటికంటె ఒకటిన్నరరెట్లయినను వర్ధిల్లఁ జేసెదను. [10] సమయముదొరకినప్పుడెల్ల నీయర్థమును శిలలపై చెక్కించుడు. [11] శిలాస్తంభములున్నచోట్లనెల్ల శిలాస్తంభములపై దీనినిచెక్కింపవలెను. [12] ఈధర్మశ్రావణము ప్రకారము ఈఅధికారముగల రాష్ట్రమందంతటను నొకనిని పంపవలెను. [13] ఈధర్మశ్రావణము నేనుప్రయాణములోనుండఁగా చేయఁబడినది. [14] ఈప్రయాణమునందు 256 రాత్రులను గడపితిని.

---

## సాహాస్రాం శిల

సాహస్రమను పట్టణము దక్షిణబీహారులోని షహాబాదు జిల్లాలోని యొక తాలూకాకు ముఖ్యపట్టణముగానున్నది. ఇచ్చటి అశోకుని శాసనము ఒకగుహాలో నుండుటచేత ఇంచుకంతయు చెడలేదు.

1. [1] దేవానాంపియే హేవం అ...లి యాని సవఛలాని - అం ఉపాసకే సుమి। [3] న చు బాఢం పలకంతే

2. [4] సవఛ లే సాధికే। అం... తే [5]ఏ తేన చ అంతలేన। జంబుదీపసి అంమిసం దేవా। సంత

3. మునిసా మిసం దేవ కటా। [6) పల...ఇయం ఫలే (7)నో... యం మహతతా వ చకియే పావతవే। ఖుదకేన పి పల-

4. కమమినామేనా విపులే పి సుఅగ . . కియే ఆలా. . . వే । (8) సే ఏతాయే అఠాయే ఇయం సావానే। ఖుదకా చ ఉడావా చావ –

5. లకమంతు అంతా పి చ జానంతు । చిలఠితీకే చ పలాకమే హోలాతు, [10] ఇయం చ అఠే వఢిసతి విపులం పి చ వఢిసతి

6. దియాఢియం అవలధియేనా దియఢియం వడిసతి [10] ఇయం చ సవనే విపుథేన [11] దువే సపంనా లాతి-

7. సథా విపుథా తి ౨౦౦-౫౦-౬ [12] ఇమ చ అఠం పవతేసు లిఖాపయాథా [13] య . . వా అ-

8. ధి హేతా సిలాథంభా తత పి లిఖాపయథ తి

సంస్కృతము, తెలుఁగు

చూ. రూపనాథశిలాశాసనము, సిద్ధపురశిలాశాసనము.

---

# బైరాతుశిల

---

బైరాతుగ్రామము రాజపుత్రస్థానములోని జయపుర సంస్థానమునందలి యొకతహశీలునకు ముఖ్యపట్టణము. ఇది జయపురమునకు 42మైళ్ళదూరముననున్నది. శాసనశిల 17 అడుగులఎత్తును 24 అడుగుల పొడుగును 15 అడుగుల దళసరిగను నున్నది

బైరాతు శిలాశాసనము.

1. [8] దేవానంపియే ఆహా [2] సాతి. . .

2. వసాని య హాకం ఉపాసకే [3] నో చు బాఢం. . .

3. అం మమయా మఘే ఉపయాతే బాఢ చ. . .

4. జంబుదిపసి అమిసా న దేవేహి. . . మి. . . కమన ఏస. . . లే

5. (7) నో హి ఏసే మహాతనేవ చకియే...కమమినేనా
6. విపులే పి శ్వగే చక్యే ఆలాధేతవే [8]...కా చ ఉడాలా చా
పలకమతు తి
7. అంతా పి చ జానంతు తి చిలఠిత...లం పి వఢిసతి...
8. దియఢి యం వఢిసతి—

సంస్కృతము, తెలుఁగు. చూ. రూపనాథశిలాశాసనము.

---

# కలకత్తాబైరాతుశిల

---

ఈశిల ప్రస్తుతము కలకత్తాలో బంగాళాఏషియాటిక్కుసొసైటీవారి కార్యాలయమందున్నది. ఇది మొట్టమొదట బైరాతువద్ద నుండెను.

1. (1) ప్రియదసి లాజా మాగధే సంఘం అభివాదేతూనం ఆహా అపా
బాధతం చ ఫాసువిహాలతం చా
2. [2] విదితే వే భంతే ఆవతకే హమా బుధసి ధంమసి సంఘసీ
తి గాలవే చం ప్రసాదే చ [3] ఏ కేచి భంతే
3. భగవతా బుధేన భాసితే సర్వే సే సుభాసితే వా (4) ఏ చు
ఖో భంతే హమియాయే దిసేయా హేవం సధంమే
4. చిలఠితీకే హోసతీ తిఅలహామి హకం తం వాతవే [5]ఇమా-
ని భంతే ధంమపలియాయాని వినయసముకసే
5. అలియవసాణి అనాగతభయాని మునిగాథా మోనేయసూతే
ఉపతిసపసినే ఏ చా లాఘులో-
6. వాదే ముసావాదం అధిగిచ్య భగవతా బుధేన భాసితే ఏతాని
భంతే ధంమపలియాయాని ఇఛామి

7. కింతి బహుకే భిఖుపాయే చా భిఖునియే చా అభిఖినం సునేయు
చా ఉపధాలయేయూ చా

8. [6] హేవంమేవా ఉపాసకా చా ఉపాసికా చా [7] ఏతేని
భంతే ఇమం లిఖాపయామి అభిప్రేతం మే జానంతూ తి

### సంస్కృతము.

1. ప్రియదర్శీ రాజా మాగధం సంఘ మభివాదన మాహ, అపా
బాధత్వం చ ఫలతు విహారత్వం చ [2] విదితం వో భదన్తా
యావ దస్మాకం బుద్ధే ధర్మే సఙ్ఘ ఇతి గౌరవఞ్చ ప్రసాదశ్చ
(3) యత్కించి ద్భదన్తా భగవతా బు భాషితం సర్వంతత్సు
భాషితం వా [4] యత్తు ఖలు భదన్తా మయా దృశ్యతఏవం
సద్ధర్మ శ్చిరస్థితికో భవష్యతీ త్యర్హామ్యహం తద్వర్తయితుమ్
[5] ఇమే భదన్తా ధర్మపర్యాయా వినయసముత్కర్షః ఆర్య్యవ
ంశః అనాగతభయాని మునిగాథా మౌనేయసూత్ర ముపతి
ష్యప్రశ్న ఏవఞ్చ రాహులవాదో మృషావాదమధికృత్య భగ
వతా బుద్ధేన భాషితః ఏతాన్భదన్తా ధర్మపర్యాయా నిచ్ఛామి
కిమితి బహవో భిక్షుక భిక్షుక్యశ్చశ్రృణుతయు రవధారయేయు
శ్చ[6] ఏవమే వోపాసకా శ్చోపాసికాశ్చ [7] ఏతేన భదన్తా ఇ
దం లేఖయామ్యభిప్రేతం మే జానన్త్వతి.

### తెనుఁగు.

1. మగధరాజగుప్రియదర్శీ సంఘమునకు అభివాదనముచేసి, వారు నిర్బాధముగను, సౌఖ్యముగనునుండుఁరుగాకయని కోరుచున్నాఁడు. (2) అయ్యలారా, నాకు బుద్ధునియందును, ధర్మమునందును, సంఘమునందును నెంతటిగౌరవవిశ్వాసములు గలవో మీకు తెలియును. (3) అయ్యలారా, భగవంతుఁడగు బుద్ధుఁడుపలికినదంతయును, సుభాషితమైయున్నది. (4) కాని, అయ్యలారా, "సద్ధర్మము చిరస్థాయిగానుండఁ

గలదు." అనువాక్యముయొక్క అర్థమును తెలుపుట నాకువిధియై యున్నది 5. అయ్యలారా,1 వినయసముత్కర్షము (2) ఆర్యవంశములు (3) అనాగతభయములు, [4] మునిగాథలు, [5] మునిసూక్తములు. [6] ఉపతిష్యప్రశ్నలు, [7] రాహులవాదము మొదలగు భగవంతుఁడగు బుద్ధునిచే అసత్యమునుగూర్చి తెలిపినయంశములను, అయ్యలారా, అనేకభిక్షువర్గములును, అనేకభిక్షుణీవర్గములును ఆధర్మములయర్థమును మఱలమఱలవినుచు, వానినిగూర్చిధ్యానింతురుగాకయని నేనుకోరుచున్నాను. (6) అట్లే ఉపాసకులును, ఉపాసికలును, చేయుదురుగాక. (7) అందుచేత అయ్యలారా, వారు నాయభిప్రాయమును తెలిసికొందురుగాకయని నేను వీనిని లిఖింపించుచున్నాను.

---

# మస్కీ-శిల

---

మస్కీగ్రామము నైజామ్ఇలాకా, రాయచూరుజిల్లా, లింగచూగూరుతాలూకాలో రాయచూరునకు 46 మైళ్ళదూరముననున్నది. ఈగ్రామమునకు పూర్వశాసనములలో ముసంగియని, పేరుగలదు. ఈశాసనమును రావుబహుద్దూర్ హెచ్ కృష్ణశాస్త్రిగారు చదివి ప్రకటించియున్నారు. ఈశాసనము చాలముఖ్యమయినది. అశోకునిఅన్ని శాసనములోను "దేవానాంప్రియప్రియదర్శి" యనియేయాతనిపేరు కాన్పించుచున్నదిగాని, యశోకునిపేరు కనఁబడలేదు. దేవానాంప్రియ ప్రియదర్శినామములు చంద్రగుప్తునికిని, అతనికొడుకు బిందుసారునికిని, అతనికొడుకుఅశోకునికిని, అతనికొడుకుదశరథునికినిగూడ నుండెను. అందుచేత ఈశాసనములను వ్రాయించినవారు వీరిలోనెవ్వరని ఇంతకు పూర్వము కొంతసందేహముగనుండెడిది. కాని, ఈమస్కీ-శాసనమందు దేవానాంప్రియ అశోకుఁడు అనుపేరుగూడ కానవచ్చుటచేత నీశాసన

ములనువ్రాయించినవాఁడు అశోకుఁడే కాని మఱియొకఁడు కాఁడని నిశ్చయమైనది.

## మస్కీ-శిలాశాసనము.

1. (1) దేవానంపియస అసోకస ... అథతి-
2. ... ని వసాని, అం సుమి బుధశకే [3]...తిరే...
3. ... మి సంఘం ఉపగతే ఉర...మి ఉపగతే [4] పురే జంబు—
4. ... సి యే అమిసా దేవా హుసు తే దాని మిసిభూతా (5) ఇయ అతే ఖుద-
5. కేన పి ధమయుతేన సకే అధిగతవే (6) న హేవం దఖితవియే ఉతా-
6. లకే వ ఇమ అధిగఛేయూ తి [7] ఖుదకే చ ఉడాలకే చ వత
7. వియా హేవం వే కలంతం భదకే సే అ...తికే చ వఢి-
8. సితి చా దియఢియం హేవం తి

## సంస్కృతము

(1) దేవానాంపియస్య అశోకస్య...అర్ధతృని ... ని వర్షాణి అహమస్మి బుద్ధశాక్యః [3] ... సంఘముపగతో ... ఉపగతో [4] పురా జంబూద్వీపే యేఅమిశ్రాదేవాస్సంతి తె ఇదానీం మిశ్రీభూతాః [5]అయమర్థో క్షుద్రకేణాపి ధర్మయుతేన శక్యో అధిగంతుమ్ [6] న ఏవం ద్రష్టవ్యో ఉద్ధతో వా ఇమం అధిగంతుమితి. [7] క్షుద్రకశ్చ ఉద్ధతశ్చ వక్తవ్యః ఏవం యత్కారింత్య భద్రకాః తే......చ వర్ధిష్యతి చ ద్వర్థం ఏవమితి.

## తెనుఁగు

(1) దేవానాం ప్రియుఁడగు అశోకునిధర్మశ్రావణము [2] నేను బుద్ధశాక్యుఁడనై రెండున్నరసంవత్సరములు పైఁగా నైనది. [3] నేను

సంఘమును దర్శించి కొంతయుత్సాహమును చూపుచుండినప్పటి నుండియు ఒకటిన్నర సంవత్సరములు పైఁగాఅయినది. (4) జంబూ ద్వీపములో పూర్వము మనుష్యులతోఁ జేరని దేవతలను వారితో కలిపితిని. (5) ధర్మనిరతుఁడైన క్షుద్రునికైనను ఈయర్థము లభింపఁగలదు. (6) గొప్పవాఁడే దానిని పొందఁగలఁడని యెవ్వఁడును తలంపఁగూడదు. (7) "మీరిట్లు ప్రవర్తించినయెడల ఈయర్థమభివృద్ధినొంది చిరస్థితికమై, ఇంతకు ఒకటిన్నరరెట్లు వర్ధిల్లఁగలదు" అని బీదవారితోఁడను, గొప్పవారితోడనుకూడ చెప్పవలయును.

---

# మైసూరుశిలాశాసనములు



ఈమూఁడుశాసనములు మైసూరుసంస్థానములోని చిత్రదుర్గము జిల్లా ముళ్కార్మూరుతాలూకాలో చిన్నహగ్గరి నదియొడ్డుననున్న చిన్నకొండలలో నున్నవి. ఈమూఁడును సిద్దాపురమునకు సమీపములోనున్నవి. వీనిలో బ్రహ్మగిరిశాసనము చెడకయున్నది. దీనికొకమైలు పశ్చిమరగా సిద్దాపురశాసన మొకటియున్నది. పశువులకాపువారు ఈ రాళ్ళపై కూర్చుండి, ఈశాసనములను చాలావఱకు చెడఁగొట్టినారు. మూఁడవశాసనము బ్రహ్మగిరికి మూఁడుమైళ్ళదూరముననున్న జటింగ రామేశ్వరమను కొండపైనున్నది. ఈశాసనము కొండమీదనున్న దేవాలయమునకు కట్టిన మెట్లదారిలో నుండుటచేతను దానిపై యాత్రికులు నడచుచుండుటచేతను, ఇదియున్నస్థానమున నీడగానుండుటచేతను ఇచ్చట గాజులవర్తకులు తమదుకాణములు పెట్టుచుండుటచేతను వారిదుకాణములుంచుటకు వేసిన కట్టెలను నిలుపుటకై కన్నములను త్రవ్వుటచేతను, ఈశాసనము మిక్కిలియు చెరిగియున్నది. ఇప్పుడు

మైసూరుమహారాజావారు దీనిచుట్టును కటకటాలు కట్టించి శాసనమును భద్రముగా కాపాడియున్నారు.

---

## బ్రహ్మగిరిశిలాశాసనము

---

1. (1) సువంణగిరీతే అయపుతస మహామాతాణాం చ వచనేన ఇసిలసి మహామాతా ఆరోగియం వతవియా హేవం చ వతవియా (2) దేవాణంపియే ఆణపయతి
2. (3) అధికాని అఢాతియాని వసాని యం హకం...సకే (4) నో తు ఖో బాఢం ప్రకంతే హుసం ఏకం సవఛరం (5) సాతిరేకే తు ఖో సంవఛరేం
3. యం మయా సంఘే ఉపయాతే బాఢం చ మే పకంతే (6)ఇ-మినా చు కాలేన అమిసా సమానా మునిసా జంబుదీపసి
4. మిసా దేవేహి (7) పకమస హి ఇయం ఫలే (8) నో హీయం సక్యే మహాత్పేనేవ పాపోతవే కామం తు ఖో ఖుదకేన పి
5. పకమి...ణేణ విపులే స్వగే సక్యే ఆరాధేతవే (9) ఏతాయ ఠాయ ఇయం సావణే సావాపితే
6. ......మహాత్పా చ ఇమం పకమేయు తి అంతా చ మై జానేయు చిరఠితీకే చ ఇయం
7. పక...[10] ఇయం చ అఠే వఢిసితి విపులం పి చ వఢిసితి అవరధియా దియఢియం
8. వఢిసితి [11] ఇయం చ సావణే సావాపితే వ్యూథేన [12] ౨౦౦ ౫౦ ౬ [13] సే హేవం దేవాణంపియే
9. ఆహ [14] మాతాపితుసు సుసూసితవియే హేమేవ గరుసు ప్రాణేసు ద్రహ్యితవ్యం సచం

10. పతవియం సే ఇమే ధంమగుణా పవతితవియా 15-హేమేవ అం తేవాసినా

11. ఆచరియే అపచాయితవియే ఞాతికేసు చ కం యా...రహం పవతి తవియే

12. (16) ఏసా పోరాణా పకితీ దీఘావుసే చ ఏస _17 హేవం ఏస కటివియే

13. (18) చపడేన లిఖితే లిపికరేణ

సంస్కృతము.

1. సువర్ణగిరీతో ఆర్యపుత్రిస్య మహామాత్రాణాం చ వచనేన ఈసిలాయాం మహామాత్రా ఆరోగ్యం వక్తవ్యా -2 దేవానాం ప్రియః ఆజ్ఞాపయతి.

ఇచ్చటినుండిమిగిలినది చూ.రూపనాథశిలాశాసనముసిద్ధపురశిలాశాసనము

తెనుఁగు.

-1 సువర్ణగిరినుండి రాజపుత్రునియు, మహామాత్రులయు వచనముగా ఈసలీపురమహామాత్రుల కారోగ్యమునుచెప్పి, ఇట్లుపలుకవలయును. -2 దేవానాంప్రియుఁ డాజ్ఞాపించుచున్నాఁడు. -మిగిలినది

చూ. రూపనాథశిలాశాసనము.

చూ. సిద్ధపురశిలాశాసనము.



# సిద్ధపుర శిలాశాసనము



1. సువంణగిరీతే అయపుతస మహామాతా —
2. ణం చ వచనేన ఇసిలసి మహామాతా
3. ఆరోగియం వతవియా -2 దేవానంపియే హేవం
4. ఆహా 3. అధికాని అఢాతియాని వసాని
5. యం హాకం ఉపాసకే _4 నో తు ఖో బాఢ పకంతే హుసం ఏ-
   కం సవఛ...
6. _5 సాతిరేకే తు ఖో సంవఛరే యం మయా సంఘే ఉపయీ
   తే బాఢం
7. చ మే పకంతే _6 ఇమినా చు కాలేన అమిసా సమానా ము
8. ...జంబుద...మిసా దేవేహి _7 పకమస హి ఇయం ఫలే -8
   నో హి ఇ—
9. యం సకే మ...నేన పాపోతవే కామం తు ఖో ఖుదకేన
10. పి ప......న విపులే స్వగే సకే ఆరాధేతవే
11. _9సే...యం ఇమం సావణే సావితే యథా ఖు
12. దకా చ మహాత్పా చ ఇమం పకమేయు తి అంతా చ
13 ...చరతీకే చ ఇయం పకమే హోతి
14. -10...వఢిసితి విపులం పి చ వఢిసితి అ
15. యఢియం వఢిసితి -(11) ఇయం చ సావణే
16. ...-(12)౨౦౦ ౫౦ ౬ -(13) మా...సితవియే
17. హ్యొతవ్యం శచం వత...యం ఇమే ధంమగు
18. ...-(14)హేమేవ అం...ఆచరియే అపచాయితవియే సు

19. ....(15) ఏసా పోరాణా...కితీ దీఘావుసే చ (16)-హేమే వ...ంతేవిసిసే చ

అచరియే...థారహాం పవతితవ...ను..

21. ...స తధా కటవియే (18) చప...

22. ...ణ

సంస్కృతము.

1. సువర్ణగిరేః రాజపుత్రస్య మహామాత్యానాం చ వచనేన ఋషిలే మహా-మాత్యా ఆరోగ్యం వక్తవ్యా ఏవం వక్తవ్యాః దేవానాంప్రియ ఆజ్ఞాపయతి అధికార్ధద్వయాని వర్షాణి యదహముపాసకోభవం న తు ఖలు బాఢం ప్రక్రాన్తోఽభవ మేకం సంవత్సరమ్, సాతిరేకస్తు ఖలు సంవత్సరో యన్మయా సంఘ ఉపేతో బాఢం చ మయా ప్రక్రాన్తమ్ అమునా తు కాలేనఅమృషానమానా మనుష్యా జమ్బూద్వీపే మృషా దేవైః, ప్రక్రిమస్య హి ఇదం ఫలమ్, నహీదం శక్యం మహాత్మనైవ ప్రాప్తుమ్, కామం తుఖలు క్షుద్రకేణాపి ప్రక్రమ- మాణేన విపులః స్వర్గః శక్య అరాధయితుమ్, ఏతస్మాయార్థా యేదం శ్రావణం శ్రావితమ్ (క్షుద్రాశ్చ) మహాత్మాన శ్చేమం ప్రక్రమేర న్నన్తాశ్చ మే జానీయు శ్చిరస్థితిక శ్చాయం (ప్రక్రిమో భవతు) అయం చార్థం వర్ధిష్యతే అవరధియా ద్వ్యర్థం వర్ధిష్యతే, ఇదం చ శ్రావణం శ్రావితం బుద్ధేన ౨౫౬, తదేవం దేవానాంప్రియ ఆహ, మాతాపితోః శుశ్రూషితవ్యం గురుత్వం ప్రాణేషు ద్రఢయితవ్యం సత్యం వక్తవ్యమ్, త ఇమే ధర్మగుణాః ప్రవర్తయితవ్యాః ఏవ మే వాన్తే-వాసినా ఆచార్యోఽపచేతవ్యో జ్ఞాతికేషు చ క (లే) యథార్హ్యం ప్రవర్తితవ్యమ్ ఏషా పురాణీ

ప్రకృతి ర్ఘధ్రాయుషే చ, ఏత దేవ మేత త్కర్తవ్యం చ, పార్థేన లిఖితం లిపిక రేణ.

తెనుగు : చూ. రూపనాథశిలాశాసనము.

---

# జతింగరామేశ్వరశిలాశాసనము

---

1. (1) —తాన చ వ—
2. ఇసి—వియా (2) దేవాన—
3. —యు హాకం—
4. ఖోబాధ—[5]—తిరేకే—
5. యం—యా—
6. ణ—
7. హి ఇయం—
8. —
9. —
10. — చ—ఢిన..
11. —పులంపి—యుఢియం—
12. (11)ఇ—సావణే—థేన (12) ౨౦౦ ౫౦ ౬ (13) హేమేవ
13. మాతాపితుసు—సితవియే హేమేవ—న—ం సు
14. —హ్యితవ్యం సచం వతవియం సే ఇమే—
15. హేవం పవతితవియా (14) న్వ అం న తే సతవస—
16. తవియు హేమేవ ఆచరియే అంతేవాసినా—
17. రాణా పవితీ— సితవియా— వియే
18. —చరియే అ— ఆచరియుళ ఞాతికా తే.. యుధారహం పవ-

19. తితవియే (15) ఏసా పోరాణా పకితీ దీఘా—చ (16) హేమేవ
శ——౦—

20. చ యా——వతితవియే (17) ధంమే దేవాణంపియ

21. వం కటవియే (18)—తేన లిఖితం

22. —పికరేణ

సంస్కృతము. తెనుఁగు. చూ. రూపనాథ, సిద్ధపుర, శిలాశాసనములు



# బారాబర్ గుహలు



బారాబర్ గుట్టలు దక్షిణబీహారములోని గయకు 15 మైళ్ళ దూరముననున్నవి. ఈశాసనములవలన బారాబరుకొండకు ఖలతికపర్వతమని పేరుండి నట్టు తెలియవచ్చుచున్నది.

బారాబరుగుట్ట : గుహాశాసనములు.

మొదటిగుహాశాసనము : బారాబరుగుట్ట.

1. లాజినా పియదసినా దువాడసవసాభిసితేనా

2. ఇయం నిగోహకుభా దినా ఆజీవికేహి.

సంస్కృతము.

రాజ్ఞా ప్రియదర్శినా ద్వాదశవర్షాభిషిక్తే నేయం న్యగ్రోధగుహా దత్తా అజీవకేభ్యః

తెనుఁగు.

ప్రియదర్శిరాజు పట్టాభిషిక్తుఁడయిన పండ్రెండవసంవత్సరమున ఈన్యగ్రోధగుహా ఆజీవకుల కీయఁబడినది.

రెండోగుహాశాసనము : బారాబరుగుట్ట

1. లాజినా పియదసినా దువా—
2. డనవసాభిసితేనా ఇయం
3. కుభా ఖలతికపవతసి
4. దినా ఆజీవికేహి

సంస్కృతము.

రాజ్ఞా ప్రియదర్శినా ద్వాదశవర్షాభిషిక్తే నేయం గుహా ఖలితకపర్వతే దత్తా అజీవకేభ్యః

తెనుఁగు

ప్రియదర్శి రాజు పట్టాభిషిక్తుఁడైన పండ్రెండవయేఁట ఖలితక పర్వతమందలిగుహ ఆజీవకులకు ఇవ్వఁబడినది.

మూఁడోగుహాశాసనము: బారాబరుగుట్ట

1. లాజ పియదసీ ఏకునవీ-
2. సతివసాభిసితే జలఘో-
3. సాసమథాత మే ఇయం కుభా
4. సుపియే ఖ—ది-
5. నా

సంస్కృతము.

రాజా ప్రియదర్శీ ఏకోనవింశతివర్షాభిషిక్తః (సుప్రియగుహాం ఖలితక-పర్వతే ఆజీవకేభ్య దత్తవాన్.)

తెనుఁగు.

ప్రియదర్శిరాజు తాను పట్టాభిషిక్తుఁడైన పందొమ్మిదోయేఁట ఖలతిక పర్వతము మీఁది యీమనోహరమైన గుహను ఆజీవకులకు) ఇచ్చెను.

# ప్రశ్నలు

## I

1. ఈశాసనములను వ్రాయించినవారెవరు?
2. "దేవానాంప్రియ" అనుపేరు ఏయేశాసనములలో కానవచ్చు చున్నది?
3. "ప్రియదర్శి"అనుపేరు ఏయేశాసనములలో కనఁబడుచున్నది.
4. ఈరెండుపేళ్ళుకలిసి ఏయేశాసనములలో కానవచ్చుచున్నవి?
5. దేవానాంప్రియప్రియదర్శి యనుబిరుదులు ఇంకనేరాజులకైనఁ గలవా?
6. ఈశాసనములనువ్రాయించినవాఁడు అశోకుఁడనిచెప్పుటకు ఏశాసనమాధారముగానున్నది?
7. దేవానాంప్రియశబ్దమునకు వ్యుత్పత్త్యర్థమేమి?
8. సంస్కృతములో దానికెట్టి యర్థమువచ్చినది? ఎందుచేత?
9. ఈశాసనములందు తెలుఁపబడినయితరరాజులపేళ్ళను తెలుపుము?
10. ఈరాజులు ఏదేశము లేలుచుండిరో ఎప్పటివారో తెలుపుము?
11. అశోకునికాలమును ఎట్లునిర్ణయింపఁగలవు?
12. అతనిశాసనములలో దేనితరువాత నేదివ్రాయఁబడియుండునో నిర్ణయించిచెప్పుము?

## II

1. ఈశాసనములున్నప్రదేశములనుబట్టి అశోకునిరాజ్యవిస్తీర్ణమును నిర్ణయింపుము?
2. ఈతనిరాజ్యమునకు రాజధానిఏది? అపట్టణముపేరు ఏశాసనమునందుకనబడుచున్నది? ఈపట్టణమునకు ఇప్పుడు ఏమనిపేరు? ఇది పూర్వ మేరాజ్యములోనుండెను? అశోకునికి మాగధుఁడనుపేరు ఏశాసనమునందున్నది?

3. ఈశాసనములో తెలులుపఁబడిన మగధరాజ్యములోని మఱియొక స్థలముపేరు చెప్పుము?

4. ఈశాసనములలో తెలుపఁబడిన మఱికొన్ని స్థలములపేళ్ళను తెలుపుము?

5. ఇప్పు డాయాపట్టణములకు ఏమనిపేళ్ళున్నవి?

6. అవియెచ్చటనున్నవి?

7. అశోకుఁడు కళింగరాజ్యము నెప్పుడుజయించెను?

8. అప్పుడు కళింగరాజ్యమునకు రాజధానియేది?

9. జౌగడాశిల కాకాలమున నేమనిపేరుండెను?

9. అశోకుఁడు ధర్మమహామాత్రులను, స్త్రీధ్యక్షమహామాత్రులను ఏలనియమించెను? వీరుచేయవలసిన పనియేమి?

10. రాజూకులు, లేకలాజూకులు అనువారెవ్వరు? వీరి కెట్టి యధికారముండెను?

11. యుతులు, దూతలు, చారులు, గూఢపురుషులు అనువారినిగూర్చి ఏయేశాసనములందు తెలుపఁబడియున్నది?

12. అశ్వాధ్యక్షులు, హస్త్యధ్యక్షులు వీరినిగుఱించి ఈశాసనములం దెచ్చటనైన తెలుపఁబడియున్నదా?

13. లిపికారులనుగుఱించి యీశాసనములవలన మీకేమి తెలియవచ్చుచున్నది!

14. అశోకుఁడు న్యాయపరిపాలనవిషయమై తనకుతాను నియమించుకొన్నవిధుల నీశాసనములనుండి ఎత్తివ్రాయుము?

15. ఈశాసనములలో తెలుపఁబడిన కొందఱు జనులపేళ్లను తెలుపుము? వారేయేదేశములయం దుండిరి?

## III

1. ఆర్యపుత్ర, కుమారా, అనుపేళ్ళు ఏయేశాసనములందు కనం బడుచున్నవి?
2. ఆశబ్దముల కర్థమేమి?
3. కుమారులకును ఆర్యపుత్రులకును భేదమేమై యుండును?
4. ఈశాసనములలో అశోకుఁడు తనకొడుకులకును రాజులకొడుకుల కును నేమైన భేదముఁ గల్పించినాఁడా?
5. ఆభేదమెట్టిది?
6. మహామాత్రులు, ప్రాదేశికులు, అనువారెవరు?
7. నగరవ్యవహారక, నాగరక అనఉద్యోగస్థులు ఏమిపనిచేయు చుండిరి?
8. అంతమహామాత్రు లెవ్వరు? వీరుచేయవలసిన పనియేమి?

## IV

1. కలకత్తాబైరాతుశిలాశాసనము, కౌశాంబీ, సాంచీ, సార్నాధు స్తంభశాసనములు, ఎనిమిదవశిలాశాసనము, రుమ్మిందై స్తంభ శాసనము, నిగళీసాగర స్తంభశాసనము, కల్సి, ధౌలీశిలలమీఁ దివనుఁగువిగ్రహములు.—వీనిని బాగుగాచదివి అశోకునికి బౌ ద్ధమతమునందు ఎట్టియభిమానముండెనో, అతఁడెప్పుడు బౌద్ధ మతమును స్వీకరించెనో బౌద్ధమతవ్యాపనమునకు అతఁడేమేమి చేసెనో నిర్ణయింపుము?
2. అశోకుఁడు ఎప్పుడు బౌద్ధఉపాసకుఁడయ్యెను? 2. అంతడు సంఘ ము నెప్పుడు దర్శించెను? 3. అతఁడు యాత్రికై ఎప్పుడు బయ లుదేరెను? 4. రూపనాధశాసనమును ఎప్పుడు ప్రకటించెను? ఈవిషయములను శాసనములనుబట్టి నిర్ణయింపుము?

3. 1 కళింగమును జయించుట? 2. సంబోధినిదర్శించుట? 3. ధర్మశాసనములను ప్రకటించుట? ధర్మాభివృద్ధికరములగు ఉత్సవములను ప్రవర్తింపఁజేయుట?—ఇవిఅశోకుఁడు అభిషిక్తుఁడయినఏయేసంవత్సరములలో జరిగెను.

4. అశోకునకు మొదట చండాశోకుఁడను పేరుండెను. తరువాతధర్మాశోకుఁడను పేరుగలిగెను." అని మహావంశమునందు చెప్పఁబడియున్నది. చండాశోకుఁడను పేరు అతనికేలవచ్చెనో, అతఁడు ధర్మాశోకుఁడుగా నెప్పుడు ఎందుకు మారెనో ఈశాసనముల నుండి యుదాహరణపూర్వకముగా నిర్ణయించునది?

1. ఈశాసనములకు అశోకుఁడు పెట్టిన పేరేమి?
2. ధర్మశ్రావణమనగానేమి?
3. ధర్మలిపులను ధర్మశ్రావణములను ప్రవర్తింపఁజేయుటయందు అశోకునియభిప్రాయమేమి?
4. ధర్మము వ్యాపించుటకు అతఁడుఒనరించినకార్యము లేవి?
5. అశోకుఁడు తనప్రజలయెడలను ప్రాంతదేశవాసులయెడలను నెట్టియభిమానమును జూపెను?
6. ఈధర్మశాసనములందు ప్రజల ఇహలోక పరలోక సౌఖ్యముకొఱకు అశోకుఁడు కష్టపడెనని తెలుపబడియున్నది. ఈవిషయమున నతనిని ప్రపంచచరిత్రములోని ఇతరరాజులతో పోల్చి చూపుఁడు?
7. అశోకుఁడు తనప్రజలు ముఖ్యముగా నవలంబింప వలసినవని చెప్పిన ధర్మగుణములెవ్వి?
8. అశోకునకు బౌద్ధేతరమతములందు ద్వేషములేదని ఎట్లు చెప్పఁగలవు?

9. అశోకునికి జంతువుల యెడలగల దయను ఈశాసనముల మూలమున నిరూపింపుము?

10. ధర్మవిజయమనఁగా నేమి? ధర్మవిజయమెట్లు కలుగునని అశోకుని యభిప్రాయము?

11. ఈశాసనములఁబట్టి బౌద్ధమతస్వరూపమును సంగ్రహముగా తెలుపుము?

12 బౌద్ధమతమునకును బ్రాహ్మణమతమునకునుగల పోలికలను, భేదములను చూపుము?



రాజన్ ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము.—1917.

# అశోకునిశాసనములకాలనిర్ణయము.

ఈ శాసనముల కాలమును నిర్ణయించుటకు గల బాహ్యా ధారములు చాలాస్వల్పముగ నున్నవి. కావున శాసనములలోని అంతస్సాక్ష్యముమాత్రమే ముఖ్యప్రమాణముగ గ్రహించవలసియున్నది. అశోకుఁడు రాజ్యాభిషిక్తుఁడైన 12వ సం॥ న 3, 4 శిలాశాసనములును, 26 వ సం॥ న 1, 4, 6, స్తంభశాసనములును, 27 వ సం॥ న 7 వ స్తంభశాసనమును ప్రకటించినట్లు అయాశాసనములలో లిఖింపఁబడియున్నది.

3, 4 శిలాశాసనములవిషయమున కొంచెముభేదముకలదు. 3వ శాసనములో 'నా రాజ్యాభిషేకమైన పన్నెండో సంవత్సరమున ఇది ఆజ్ఞాపింపఁబడినది' యని వ్రాయఁబడియున్నది. అనఁగా అంపిలి యుత్తరవులు 12 వ సంవత్సరమున చేయఁబడినవి, గాని, శాసనమే ఆసంవత్సరమున లిఖింపఁబడినట్లు చెప్పఁబడలేదు. ఇట్లు చెప్పఁబడకపోయినను, ఆ సంవత్సరమున తప్ప మఱియొక సంవత్సరమున నీ శాసనము లిఖింపఁబడినట్లు మఱియేచోటఁగాని సూచింపబడనందునను, ఇంక నీక్రింద చర్చింపఁబడు ఇతరకారణములవలనను, ఆసంవత్సరముననే ఈశాసనము చెక్కించఁబడెనని నమ్మవలసి యున్నది. 4 వ శాసనము ఈ సంవత్సరముననే లిఖింపఁబడినట్లు స్పష్టముగా శాసనములోనే వ్రాయఁబడియున్నది.—12 వ సంవత్సరము అనగా క్రీ—పూ 256. ఆరవస్తంభశాసనమున "నేను రాజ్యాభిషిక్తుఁడైనపండ్రెండవసంవత్సరమునజనుల

హితము కొఱకును, *ధర్మలిపులు నాచేలిఖింపఁబడినవి" యని చెప్పఁబడిన వాక్యమునుబట్టి ♦ధర్మలిపులన్నియును ఈ సంవత్సరముననో మఱుసటిసంవత్సరముననో వ్రాయఁబడినట్లు స్పష్టమగుచున్నది. ధర్మలిపియనుమాట ఆరవశిలాశాసనమునకును, పదునాల్గవశిలాశాసనమునకును వర్తింపఁబడినట్లు ఈ రెండుశాసనములలోనే కాన్పించుచున్నది. హరికృష్ణదేవవిద్వాంసుఁడు ఈ సందర్భమున శిలాశాసనములైన పదునాల్గింటికిని ధర్మలిపిపదము వర్తించునని సిద్ధాంతీకరించియున్నాడు. ఆరవస్తంభశాసనమును, 7 వ స్తంభశాసనమును సైతము అశోకుఁడు ధర్మలిపులనెను, కాని, ఈ రెండుశాసనములలోనే వీటిని, తానురాజ్యాభిషిక్తుఁడైన 26, 27 సంవత్సరములలో ప్రకటించినట్లు వ్రాయఁబడినందున, ఈ రెండునుతప్ప, మిగిలినధర్మలిపులు, అనఁగా పదునాల్గుశిలాశాసనములును పై 12, 13 సంవత్సరములలో లిఖింపఁబడినట్లు నిర్ణయింపఁబడినది. అదియునుగాక షాబాజుగఢీశిలపైనున్న శాసనములన్నియును, కాల్సీశిలపైని చెక్కఁబడియున్న శాసనములును, ఒక్కొక్కశిలమీఁద ఒకవరుసగా లిఖింపఁబడియున్నవి. గిర్నారుశిలమీఁదివి కూడా దాదాపుగ అట్లేవరుసగానున్నట్లు చెప్పవచ్చును. మన్సెహ్రాలో మాత్రము మొదటిపన్నెండుశాసనములు రెండుప్రత్యేకపు శిలలమీఁదఁ ఉన్నవి. ఈ మాత్రపువ్యత్యాసమును మనము పాటించనియెడల, అన్నిచోట్లనున్న శిలాశాసనములవరుసనుబట్టి, ఇవన్నియును ఏకకాలమున లిఖింపఁబడియుండవలెనని నమ్మవలసి యున్నది. దీనికి తార్కాణముగా ధౌలీలోని శిలాశాసనములైన పదునాల్గును శిలయొక్క మధ్యభాగమున ఒక్కవరుసనేయున్నవి.

---

* 122 వ పుటను జూచునది. ఇచట 'ఈధర్మలిపులు' అనుమాటలోని "ఈ" అను అక్షరము అనవసరముగ ముద్రింపబడినది.

♦ "Asoka's Dharmalipis" by Harit Krishna Dev 1919 cf "Asoka" by V. A. Smith 3rd Ed p, 158

కాని, పండితహరికృష్ణదేవుఁడును, డాక్టరు భండార్కారుగారును మఱికొందరు విద్వాంసులును దీనికి వ్యతిరేకాభిప్రాయము కలిగియున్నారు. వీరియూహప్రకారము అన్నిశిలాశాసనములు కాకపోయినను రెండవశిలాశాసనము, పదమూఁడవ శిలాశాసనము, ఈరెండైనను, రాజ్యాభిషేక* 27వ సంII లిఖింపఁబడిన ఏడవస్తంభశాసనముకంటె వెనుక ప్రకటింపఁ బడియుండవలెనఁట. ఈ యూహకు ఒకకారణము నిచ్చుచున్నారు. అశోకునిచే ధర్మవ్యాపనమునకై త్రొక్కఁబడినపలు మార్గములను సంక్షిప్తముగ క్రోడీకరించి తెలియఁజేయునట్టి ఏడవస్తంభశాసనములో, రెండు, పదమూఁడుశిలాశాసనములలో వివరింపఁబడిన విషయములు సూచింపఁబడియుండలేదు. ఈవిషయములు, ఏడవస్తంభమునాఁటికి పూర్వమే జరిగియుండినయెడల, ఈ స్తంభశాసనమునందు వాటికిఁగూడ స్థానముండి యుండవలెను. ఆవిషయములెవ్వి యనఃౘ—అశోకప్రభువు మానవపశుచికిత్సలకుఁ గాను ఓషధులను ఫలవృక్షములను నాటించుట, నూతులను త్రవ్వించుట. (రెండవ శిలాశాసనము), అశోకుని దూతలు లేక ఉపదేశకులద్వారా పలుప్రదేశములలో ధర్మవ్యాపనము చేయుట (పదమూఁడవశాసనము), ఇటువంటి చాలాముఖ్యమైన అంశములు పైస్తంభశాసనములో కనుపించక పోవుటకు మఱియొక కారణము కాన్పించదు.

ఈయూహకు విమర్శనములేకపోలేదు. ఏడవస్తంభశాసనములలోసైతము వృక్షములను నాటించుటనుగూర్చి సూచింపఁబడియున్నది. దూతలవిషయము సూచింపఁబడకపోవుటకు కారణము రాజ్యాభిషేక 27వ సంIIము నాఁటికి దూతలముఖముగా పరదేశములందు ధర్మవ్యాపనము చేయించు విధానము♦ ముందేనిలిచిపోయి యుండవచ్చును. అట్లు

---

* "Asoka" by Dr D. R. Bhandarkar 1925 p. 47

♦ "Indian Antiquary" February 1927, pp. 27—29

కాకపోయినను, చూపబడిన బలిష్ఠమైన కారణములవలన మొదటి నాల్గు శిలాశాసనములైనను రాజ్యాభిషేక 12వ సంవత్సరము లోపల వ్రాయఁబడియుండవలెను. అయిదవశిలాశాసనము రాజ్యాభిషిక్త 13వ సం॥ సనేర్పఱుపఁబడిన మహామాత్రులకొఱకు ఆజ్ఞాపింపఁబడినట్లు శాసనములో నున్నందున అసంవత్సరమున లిఖింపఁబడి యుండవచ్చును.

స్తంభశాసనముల కాలముగూర్చి విశేషమైన చర్చలేదు. ఉన్నటువంటి యేడుశాసనములలో, 1, 4, 6, శాసనములు రాజ్యాభిషేక 26 వ సం॥న అనియును, 7వది 27వసం॥న అనియును ఆయాశాసనముల, లోనే వ్రాయఁబడియున్నది. మిగిలిన 2, 3, 5, శాసనములును ఆకాలపువి అనుటకు సందియముండదు. అయిదవస్తంభశాసనములో, తాను రాజ్యాభిషిక్తుఁడైన 26 సంవత్సరములలో 25 పర్యాయములు కారాగృహవాసులను విడుదలచేయించినట్లును, 26వ సం॥లో కొన్నివిధములైన జీవజంతువులను దేశమున చంపకూడదని అశోకుఁడు ఆజ్ఞాపించినట్లును వ్రాయఁబడియుండుటచేత ఆశాసనము మరుచటి సంవత్సరము లోఁగానే ప్రకటింపబడియుండవలెనని సక్రమముగ నూహింపనగును.

హిమాలయ ప్రాంతములోని చిల్లర స్తంభశాసనములైన లుంబినీ నిగ్లీవీశాసనములు కూడా ఆకాలముననే ప్రకటింపఁబడినట్లు కాన్పించుచున్నది. ఆరెంటిలోను అశోకుఁడు తనరాజ్యపు 20వ సం॥న ఆ స్థానములను దర్శించినట్లును ఆసమయముననే ఆస్తంభములను తాను స్థాపించినట్లును తెలుపఁబడియున్నది.ఇతర చిల్లరస్తంభములలోని ముఖ్యాంశము బౌద్ధసంఘమును విడిచినవారికి విధింపవలసిన శిక్షలను గూర్చినది.అశోకుని బౌద్ధసంఘపరిషత్తు జరిగినతర్వాత ఈశాసనములు ప్రకటింపఁబడి యుండవలెననియును, బహుశః, వాని రాజ్యాభిషేక 21 నుండి 37వ వంవత్సరముల మధ్యకాలము వాటిప్రకటనకాలమై యుండుననియును, రాణీశాసనముకూడ ఇంచుమించుగ ఆ కాలపుదే యనియును. విద్వాంసుల యభిప్రాయము. చిల్లరశిలాశాసనముల కాలముగూర్చి భేదాభిప్రాయములు పెక్కులుగలవు. రూపనాథశిల

మీఁదిశాసనమును చూచినచో నందలి చివరిపంక్తులలోని "వ్యుథేనా సావనే కతే 256 సతవివాసాత" అనుపదగుచ్ఛము ఇట్టిభేదాభిప్రాయము నకు కారణమగుచున్నది. వ్యుథేన అను పదమునకు ఈశాసనప్రతులలో వివుథేన యను పాఠాంతరముకలదు. దీనికి సరియైన సంస్కృతపదము "వ్యుష్టేన" యనునది. * ఈపదమునకు సరియైన యర్థము దొరకక పలు విధములుగ వ్యాఖ్యానములను విద్వాంసులుచేయుచున్నారు. ఉపశబ్ద మునుండి వచ్చినదనియును, కావున ప్రకాశమానార్థము పొసఁగునని యును ఓల్డనుబర్గు విద్వాంసుఁడనెను. వశబ్దమునుండి వచ్చియుండును గనుక వివాస లేక విగతవాసులను అని బుహ్లారుపండితుఁడును, బహుదేశముల వాసముచేయు ఉపదేశికునుగూర్చిన పదమని సేనార్టు పండితుఁడును, దేశమంతటను తిరుగు అశోకునకే వర్తించుపదమని థామస్, హుల్ట్జుపండితులును, వ్యుష్టాలుగా ప్రకటనలను ప్రకటించు కార్యమునందు నియోగింపఁబడిన అధికారులని డాక్టరు భండార్కారు గారును, ఇట్లు పరిపరివిధములుగ నవురు వ్యాఖ్యానముచేసి యున్నారు.

ఇక "256" అనఁగానేమి? పైపదము ఈసంఖ్యయును వెనుక నచ్చుపదములునుచేరి శాసనకాల నిర్ణయమునకు సహాయమగునా? 256 అనగా బుద్ధుఁడు చనిపోయినదాదిగ ; సంవత్సరములని బుహ్లారు పండితుఁడును, ప్రయాణములో అశోకుఁగడపిన 256 రాత్రులని లెవీమొదలగు విద్వాంసులును, అశోకుఁ ధ్యానమునందు గడపిన 256 రాత్రులని హుల్ట్జుగారును, 256 గురుతలు లేక ఉపదేశకులని విన్సెంటుస్మిత్తుగారును డాక్టరు భండార్కారుగారును ఊహించుచున్నారు.

---

* "Inscriptional Excursious" in the Maha-Bodhi Journal 1926 pp 297—302, ఈ అనుపదమువలన దూతల ధర్మోపదేశకులు అనుసందర్భానుసారమగు నర్థము చేసికొని, పీఠిక లోని ధర్మోపదేశికులనుగూర్చిన యంశములు వ్రాసె.

"సతవివాసాత" అనుమాటలకు సైతమిట్లే వివిధవ్యాఖ్యానము లుకలవు. ఈమాటలుచాలావరకు పై వివాస వ్యుత్పత్తపదములతో సంబంధించినవి.

వ్యాఖ్యానము లన్నిటిలోను వ్యుత్పత్తపదమునకు ప్రకాశమానార్థమునిచ్చి, సంవత్సరమునందు అత్యంతప్రకాశమానమైన ఉత్తరాయణ కాలము (Summer sdstice) ప్రతిపాదింపబడుచున్నదని చెప్పుచు, బుద్ధనిర్వాణ కాలమునుండి గడచిన 256 ఉత్తరాయణకాలములు అనగా 256సంవత్సరములు అని సంక్షేపార్థము చెప్పిన యెడల ఈశాసనముయొక్క కాలనిర్ణయమునకు కొంతవరకు ఆధారమున్నదని చెప్పవచ్చును. బుద్ధునినిర్వాణకాలము క్రీ-పూ 483 అని బహు పండితులచే విశ్వసింపబడుచున్నది. అప్పుడు ఈశాసనము క్రీ-పూ 227 నాటిది, అనగా అశోకుడు రాజ్యాభిషిక్తుడైన 37వ సంవత్సరము నాటిదని సిద్ధాంతీకరింపనగు. ఈవాదమును నమ్మినయెడల అశోకుని శాసనములన్నిటిలోను ఈశాసనము ఆప్రభువుయొక్క రాజ్యావసాన కాలమున ప్రకటింపబడెన చెప్పవలసియున్నది.

కాని, ఈశాసనములోనే "అయినను ఒకసంవత్సరమునకు పైగా నేను సంఘమును దర్శించినది మొదలు మిక్కిలి యుత్సాహవంతుడనై యున్నాను" అని అశోకుడు చెప్పుకొనుటవలన తాను సంఘము నంజేరి భిక్షువైన ఒకసంవత్సరము జరిగిన కొంతకాలములోనే ఈశాసనమును చెక్కించినట్లు అర్థమగుచున్నది. అనగా ఈశాసనకాలము తాను రాజ్యాభిషిక్తుడైన 10వ సంవత్సరమైయుండవలెను. అట్లైనచో ఈచిల్లర శిలాశాసనము, పదునాలుగు శిలాశాసనములన్నిటికన్న పూర్వకాలపు దని స్పష్టపడును. విన్సెంటుస్మిత్తుగారు ఈవిషయములో నించుకభేదాభిప్రాయముచూపి అశోకుని రాజ్యాభిషేక 13వ సంవత్సరముననే చిల్లరశాసనముకూడ ప్రకటింపబడి యుండవలెనని వక్కాణించిరి. ఎట్లైనను, మొదటశిలాశాసనము వాని అవసానకాలమునాటిదికాదని

నిశ్చయింపవలసియున్నది. రెండవచిల్లరశాసనముసైతము ఆకాలము నాఁటిదనుటకు సందియములేదు—బాబ్రాశాసనముకూడ ఇప్పటికాలపుదై యుండెనని విద్వాంసులు నమ్ముచున్నారు. ఒకవిద్వాంసుఁడు మాత్రము అది అశోకునిరాజ్యపు 38 సంవత్సరమునాఁటిది యనిచెప్పెను. ఇదియంత విశ్వసనీయముగా తోఁచదు.

గుహాశాసనములలోనే కొంతసాక్ష్యము కలదు. న్యగ్రోధగుహ అశోకుని రాజ్యాభిషేక 12వ సంవత్సరమునను, మఱియొకగుహసైతము అదేసంవత్సరమునను, మూఁడవది పందొమ్మిదవయేఁటను ఆజీవికులకు దానమొసఁగబడినట్లు స్పష్టముగ వ్రాయఁబడినది కావున ఆయాసంవత్సరములలోనుగాని కొలఁదికాలముతర్వాతఁగాని ఆశాసనములు లిఖింపఁబడియుండవలెను.

పై చర్చనుబట్టి అశోకునిశాసనములకాల మీక్రిందివిధముగ నుండును.

| అశోకునిరాజ్యాభిషేకము—క్రీ-పూ. | | క్రీ-పూ |
|---|---|---|
| (1) గుహాశాసనములు | 12, 19వ సంవత్సరమున | 257 250 |
| (2) చిల్లరశిలాశాసనములు | 10 లేక 13వ సంవత్సరమున | 259 256 |
| (3) పదునాల్గుశిలాశాసనములు | 12 లేక 13 సంవత్సరమున | 257 256 |
| (4) కళింగశాసనములు | 13వ లేక 14వ సంవత్సరమున | 256 255 |
| (5) ఏడుస్తంభశాసనములు | 26, 27 సంవత్సరములో | 243 242 |
| (6) హిమాలయ ప్రాంతములోని చిల్లరస్తంభశాసనము | 20 వసంవత్సరమున | 249 |
| (7) ఇతరచిల్లరస్తంభశాసనములు | 21 నుండి 37 సం॥లలో | 248నుండి232 |

— —

# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 5 | 19 | మహామాత్రుల పరిషత్తులు | పరిషత్తులు |
| 11 | 13 | జ్ఞాతులు | భ్రాతలు |
| 13 | 12 | నివేదకలను | నివేదకులను |
| ,, | 16 | ఉద్యోగస్థులు | ప్రతివేదకులు |
| ,, | 18 | సభయందెట్టి | పరిషత్తులందెట్టి |
| 109 | 1 | జౌగడాశిల | తోప్రాస్తంభము |
| ,, | 19 | మహామాత్యా | మహామాత్రా |
| 111, 113, 115, 117, 119, | 1 | జౌగడాశిల | తోప్రాస్తంభము |
| 116 | 15 | ఆ రాజపురుషులు | నా రాజపురుషులు |
| 130 | 23 | ముఖ్యామాత్యులలో | ముఖ్యులలో |
| 159 | 16 | కారువాకియొక్క తల్లియగుతీవర | తీవరతల్లియగుకారువాకి |
| 164 | 9 | భిక్షుకి | భిక్షుణి |
| 173 | 3 | ముని | మౌని |
| 179 | 10 | ప్రాణేషు | ప్రాణిషు |
| 181 | 8 | మైళ్వ | మైళ్ళు |
| ,, | 8 | పర్వ | పర్వ |

పుట 180 లో "చూ. రూపనాథశిలాశాసనము" తరువాత ఈ క్రిందిదానిని చేర్చుకోవలెను;—13-18 "దేవానాం ప్రియుఁడిట్లు చెప్పుచున్నాఁడు. తల్లిదండ్రులకు శుశ్రూష చేయవలెను. ప్రాణుల యందు గౌరవముంచవలెను. సత్యముపలుకవలెను. ఈధర్మగుణములను ప్రవర్తింపఁజేయవలెను. అంతేవాసులును ఇట్లేచేయవలెను. ఆచార్యుని పూజింపవలెను. జ్ఞాతులును కులమునందు యథార్హముగా ప్రవర్తింపవలెను. ఈపురాణమార్గము దీర్ఘాయువునిచ్చును. ఇది యిట్లేచేయఁబడవలెను. పార్థుఁడను లిపికారునిచేత లిఖింపఁబడినది."

---